# పెళ్ళిట్రెయినింగ్

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

## హెచ్చరిక

కేవల వినోదం నిమిత్తమైనాసరే, నేక సొమ్ము వసూలు చేసుకునే నిమిత్తమైనాసరే, ఈ ప్రదర్శనాలలో ఎక్కడైనా సభఎచట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ, ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీరైట్ చట్టప్రకారం ఒకనేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

## విషయసూచిక

# పెళ్లి ట్రెయినింగ్

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది అనుసరణం. ఇది 13–2–1944 తేదీని రాజమండ్రీ ఆర్ట్సుకాలేజీ మెట్‌కాఫ్ వసతిగృహంలో శ్రీ కాశీపట్నపు కొండయ్యగారి అధ్యక్షతక్రింద జరిగిన వసతిగృహ వార్షికోత్సవ సమావేశ సందర్భంలో, అనుమతితో ప్రదర్శించారు ]

శానయ్య (అనే అరుణాచలం) - శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు.
చంద్రప్రభ - శ్రీ ఆకునూరి కృష్ణమూర్తి.
సీహారం - శ్రీ పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు.
మాలోకం - శ్రీ చామర్తి సూర్యనారాయణ.
పరయ్య - శ్రీ రావాడ గున్నేశ్వరరావు.
సంతోషం - శ్రీ వాడ్రేవు సుబ్రహ్మణ్యం.
కాటయ్య - శ్రీ బోణంగి శివకామేశ్వరరావు.

---

ఈ గ్రంథంలో వాడిన సంజ్ఞలు :—

| | |
|---|---|
| R F = కుడి ఎదర | L F = ఎడమ ఎదర |
| R M = కుడి మధ్య | L M = ఎడమ మధ్య |
| R B = కుడి వెనక | L B = ఎడమ వెనక |

## రంగం - 1

[ శానయ్యబస. చిన్న బల్లా, రెండుమూడు కుర్చీలూ ఉన్నగది. తెరఎత్తిన తరవాత కుడిఎదరనుంచి శానయ్య వచ్చి ఎవరికోసమో కనిపెట్టుగున్నట్టు కనిపించి పచార్లు చేస్తూ ఉంటాడు. ఎడమ ఎదరకేసి చూస్తాడు. అక్కణ్ణించి సరయ్య వస్తాడు. ]

శా—( ఎడమ ఎదరనించి సరయ్య రాబోతూంటే ) సరయ్యేనా? రా! ( అని కుర్చీ చూపిస్తాడు )

స—( వచ్చి కూర్చుంటాడు )

శా—ఇంత ఆలస్యం అయిందేం? మా మాలోకాన్ని పంపించి చాలాసేపైందే!

స—ఏమో! ఇంతకి ముందే వచ్చి చెప్పాడు మరి!

మా—( ఎడమఎదర్నించే వచ్చి ) చాలాసేపైందండి, చెప్పి, నేనావిర స్తంభాల...

శా—సరేరా నువ్వుఉండు.

మా—ఉంటానండి. ( అని అక్కడేనుంచుంటాడు )

శా—ఉండడం అంటే వీథులో.

మా—అక్కడ నేను కూచోనాండి!

శా—ఏడిశావ్ పోదూ. వెళ్ళి ఎవరూ రాకుండా చూస్తూండు.

మా—చిత్రం. (అని ఎడమమధ్యకి పోతాడు)

స—నువ్వు ఊర్నించి ఎప్పుడొచ్చావ్ ?

శా—నిన్న నే.

స—ఏమిటి విశేషం ?

శా—ఏముందీ, పెళ్ళి రేపే !

స—ఎవరి పెళ్ళిమాట నువ్వనేదీ ?

శా—(పళ్లు కనపరుస్తూ) నాపెళ్ళే!

స—పెళ్ళికూతు రెవరూ ?

శా—అఁ. నేను ట్రెయినింగు చెయించిన చంద్రప్రభ లేమటోయ్, ఆ అమ్మాయి! ఏమంటావ్ ?

స—పెళ్ళంటే శుభమేగాని .నువ్వుకూడా భర్తాశ్రమం పుచ్చుగుంటే, నీపని ఏమవుతుందోగదా అని నాకు భయం వేస్తూంది.

శా—భర్తాశ్రమం భయంకరం అని నీయింట్లోకూడా నీకు అనుభవంగావును, పాపం! పెళ్ళి అనేది జరిగిన ప్రతీ చోటా ఏదోఅక్షింతలుగింజ పడుతూండడం, వ్యక్తుల్ని ఇల్లాంటివాళ్ళు అల్లాంటివాళ్లు అంటూ నిరసిస్తూండడంజరుగు తూంటాయిగదా అని నువ్వు వాడిలిపోతూన్నట్టు నీమొహాం చూస్తే నాకు బోధపడుతోంది.

స—కావచ్చు. దుష్టసంబంధప్రసంగాలగురించి గుంజా టనపడుతూ కూచునేవాడు కుంత! అదిఅల్లాఉండనీ కాని,నాకు నిన్నుగురించిన భయం ఏమిటంటే: పిన్నల్నీ పెద్దల్నీకూడా

ఓ తరవాయి అక్షే పెట్టకుండా భర్త అయిన ప్రతీవాణ్ణీ దుయ్యబట్టుగునే వ్యక్తివి గదా నువ్వు! తుంటర్ల అపసవ్య మేళాల గురించి అల్పాల ఎకట గోలచేసి ఏకి ఉపన్యసిస్తాం డడం అనేది నీకు పరిపాటీ, ఆనందమూ ఆయిరి!

శా—నిశ్చయంగా! ఆమాట పల్లిగ్గా ఒప్పుకుంటాను.

స—అందులోనూ నీనోరు!

శా—సరె, ఊరుని బట్టి నోరు! దౌర్జన్యం అవడంలో తప్పు లేనప్పుడు అనడంలో తప్పు ఉంటుందా? ఈఊళ్లో ఉన్నంత మంది ఆజారి భర్తల్ని మరో ఊళ్లో చూపిస్తావ్?

స—నే నెందుకూ? ఆ మరో ఊరూ నువ్వే వెళ్ళి చూసిరా.

శా—నేను విమర్శ ఊరికే చేస్తాననుకున్నావుటోయ్! ఉదాహరణలు ఓపాతికేళ్ల అనుభవంతో గ్రంథంగా రాసే శాను. విన్నావా? ఒక ఆడారి తను డబ్బుగణిస్తూ అది పెళ్లాం రహస్యంగా గుణిస్తూంటే తెలిసి గడుసుగా ఊరు కుంటాడు! మరో ఆడంగి తన పెళ్లానికి బహుమతులు వస్తూంటే అవి అందుకోడానికి గర్వంతో నిలబడతాడు. ఇంకో పెట్టమారి భయంతో భార్యామిత్రుడైన తన శత్రు వుకి ఆతిథ్యం ఇస్తాడు. ఒకడు సణుక్కుంటూను, ఒకడు ఖర్మం అనుకుంటూను, ఒకడు ఫిర్యాదు చేస్తాడు, ఒకడు నాగరికత కోసం నమ్మి విధి అనుకుని దగా పడతాడు, వేరే ఒకడు జూదంలో ధనం ఆర్జించినట్టు భార్య చెబితే ఇనప్పెట్టి కొం టాడు.

స—మహా గొప్ప సంగతులు పోగుచేశావ్, మిత్రమా! జన్మసఫలం చేసుగున్నావ్. కాని, హేళనచేసేవాడు హేళనచెయ్యబడడానికి సిద్ధంగా ఉండాలి, అన్యుల దుష్ప్రవర్తనలు చెప్పగుని నీలాగే ఆనందించే గొప్పవాళ్ళున్నారు.

శా—ఇటువంటి కబుర్లలో టోకుని గొప్పవాళ్లూ, చిల్లర్ని కొద్దివాళ్లూ యథాశక్తిగా వ్యవహరిస్తారు.

స—నేను ఇటువంటి అపవాదలగురించి అనుకోను, అనను. ఈరకం సంభావణ విన్నప్పుడుకుడా దుఃఖిస్తాను.

శా—(తీసికట్టుగా) దుఃఖిస్తావ్, అదేం ఖర్మం! ఎందుకూ?

స—ఎందుకా! ఒకవేళ నాకే అటువంటి అవస్థపట్టడం తటస్థిస్తే, జనం, నేనంటేకాస్త జాలి పడతారేమో అని! కాని, ప్రతీదంపతుల్నీ తుంటర్లని రాతుసప్రచారం చేస్తూండే నువ్వు, ఇప్పటిదాకా ఏకాకివి గనక నీరోజు వెడుతోంది. నువ్వుకూడా రేపు దాంపత్యంలో దిగావా, సమయం దొరకడంతోటే, నిన్ను ఉత్త యాగీచేసి ఊరుకోడమే కాదు, జనం నిన్ను తోక పీకెయ్యగల్రు, నీ బుర్రమీద వెంట్రుక మొలవకుండా చెయ్యగల్రు, నీ భవిష్యం తీసెయ్యగల్రు, తెలుసా!

శా—ఒస్, మాఘాటుగా చెప్పావే! ఆ మాత్రం ముందు చూపునాకూ ఉంది. అటువంటిబాధలు నాకు రాకుండా నేను ఇదివరకే కట్టుదిట్టం చేసుగున్నాను. స్త్రీల

మాయలన్నీ గమనించి, క్రోడీకరించాను. ఆమాయల కన్నిం టికీ ప్రతిమాయలు కనిపెట్టాను. ఇటువంటి కృషి చేసి ఉన్న నన్ను ఏ స్త్రీకూడా దగాచెయ్యజాలదు. అందులో, నేను పెళ్ళాడుతూన్న చంద్రప్రభని దట్టమైనఅమాయిక వాతా.,ర ణంలో పెరిగేటట్టు చేశాను.

స—నీ ఉద్దేశమూ...ఏమీ ఎరగనిపిల్లయితే...

శా—ఊఁ...ఆట్టే చిక్కులుండవ్! భార్యగడుసు దయితే—పీభార్యలాగ!—అడిగావ్, బాధ! (తలతిప్పుతూ) అబ్బే, గడసరిభార్య వడ్డీదండగవ్యాపారం. తెలివిగల పిల్లం లంటూ ఆశపడి కొందరుచేసుకున్నారు, అనుభవిస్తున్నారు. చూస్తున్నాం! ఆపిల్ల లేమిటో తెలుసా, భర్తలమీద కూడా చలాయింపే, కడంవాళ్ళమీద అడగాలీ! తమ తిండి, తమ డ్రెస్సు, తమ మీటింగులు, తమఆటలు, తమఆనందం— ఇంతే! పైగాకవిత్వాలు, ప్రణయగీతాలు! పెద్దపెద్దలంతా వాళ్ళదర్శనానికి రావడం! "ఫలానాఆవిడమొగుడు ఇడుగో వచ్చాోయ్!" అంటూ, మొగుడు చచ్చినాడి పేరు పోగొట్టి హెచ్చరిక చెయ్యడం. అమ్మఅమ్మ అమ్మ! రాయగల పిల్ల నాకొద్దు బాబూ! పిల్ల రాత నేరిస్తే మొగుడు రాతంతే! నాగృహానికొచ్చే పిల్లకిపద్యం కాదు, యతిప్రాసలుకూడా తెలియకూడదు. "అందము" అనే మాటకి అనుప్రాస పదంఏమిటీ అని ఆపిల్లని అడిగితే, "భర్త" అని సమా ధానం చెప్పేదిగా ఆపిల్ల ఉండాలి. క్రియమాట, ఆపిల్లకి;

ఓ ప్రార్థించుకోడమూ, ఓ భర్తని ప్రేమించడమూ, కొట్టుపనీ, చారం వడకడం తప్ప మరేమీ తెలియకూడదు.

స—నీ ప్రియురాలు మూర్ఖ స్త్రీ అయి ఉండాలన్న మాట!

శా—అక్కర్లా! అందులో ఎంత కొరూపిఅయి కూడా ఉంటే అంత మంచిది. అల్లాగనక ఉంటే, తెలివీ రూపమూ ఉండేకంటె లక్ష నయం.

స—(ఆశ్చర్యంతో) తెలివీ రూపమూను వొకూడదూ?

శా—ఎందుకోయ్ అవన్నీనూ! సుగుణాలుచాలదు టోయ్, నీతి!

స—సరే, నువ్ చెప్పిన జంతువులాంటి స్త్రీకి నీతి అంటేమాత్రం ఎల్లా తెలుస్తుందీ! విసిగెత్తకుండా అల్లాంటి మనిషితో నువ్వు ఉండడం ఎల్లా? అతమూర్ఖపు మనిషి తనే అనుకోకుండానూ, కోరుకోకుండానూకుడా నీతి తప్పితే, అప్పుడే గోతులో దిగుతావ్ నువ్వూ!

శా—ఇల్లాంటి వాదనకి నాసమాధానం ఏమిటంటే, నువ్వునోరు నెప్పెట్టేటట్టు వాగినాసరే, నీవాదన నాకు నచ్చ టంలేదు అనేసి ఊరుకోడం!

స—అయితేమరి వాదించను,నీయత్నంకొనసాగించు.

శా—ఎవడి యత్నం వాడిది. నా రాబోయేభార్య గురించి నావద్ద్యాటుఆచరణలో పెట్టించాను. నాదిగొప్ప వంశం, మంచిఆస్తి! కులమర్యాదా, ఆస్తిగర్వమూ రెండూ

ఉంది. తుణాని కోసారి నన్ను దెప్పి పొడవడానికి వీళ్లేనిపిల్లని ఏరాను. ఆపిల్లని నాలుగేళ్ళ వయస్సప్పుడు దారిద్ర్యంవల్ల తల్లినాకిచ్చేసింది. ఒక ఏకాంతమఠంలో చేర్పించి ఆపిల్లకి ఈ పదిహేనేళ్ళవించీ పరమార్జ్ఞానంలో మాంచి ట్రైనింగు ఇప్పించాను. ఇప్పుడు తీసుగొచ్చాను. నాభవనంలో వచ్చే వాళ్లూ వెళ్లేవాళ్లు కనక దూరంగా అవతల వీధులో ఎర్రస్తంభాలమేడవుచ్చుగుని, ఆపిల్లనిఅందులోపెట్టి, మూర్ఖులైన నౌఖర్లని అక్కడ ఉంచాను. ఎంత జాగర్త నేనుపడ్డానో చూడు!

స—అద్భుతమా!

శా—చూడూ, రాత్రి భోజనానికి ఇక్కడికి రా! మాటా పలుకూ ఆడుకుంటూ భోజనం చేద్దాం.

స—అవశ్యం.

శా—ఆపిల్ల ఎంత అమాయికురాలో నువ్ కూడా చూసి సంతోషిద్దువుగాని!

స—నువ్ చెప్పావుగా!

శా—ఏం చెప్పడం! ఆ అమాయికత్వం కళ్లారా చూడాలి, బోధపడాలి. (కులుకుతూ) ఒకొక్కప్పుడు అమాయిక సమాధానం చెప్పిందంటే వినేవాళ్లకి డొక్కబద్దలై పోతుంది. మఠంలోంచి ఇవతలకి రాగానే, అందంగా పోతవిగ్రహంలాగ ఉన్న ఓ అమ్మాయినిచూసి, ఈపిల్ల నాతో ఏమందో విన్నావా!...“ఆ అమ్మాయినిఎక్కడేనా చెయించారో లేకపోతే చెక్కించారో కనుక్కోండి!” అంది.

స—ఆహా, చాలా సంతోషంగా ఉందయ్యా, శాస్త్రియా!

శా—అదుగో, మళ్ళీ నన్ను నువ్వు "శాస్త్రియా" అంటూ ఆ వెనకటి పేరుతోనే పిలుస్తావే! "అరుణాచలం" అనలేవూ?

స—ఓహో, అదా! అరుణాచలమా! పాత పేరు పెదిమిలికి అలవాటు. కొత్తగా తెచ్చి పెట్టుగున్న పేరు స్మరణకి రాదు. ఇంత వయస్సులో యాభైయో పడిలో నీ పేరు ఎందుకు మార్చుగున్నావో ఎవ్వరికీ తెలియదు.

శా—ఎందుకో ఒకందుకు. నాయిష్టం. పాత పేరు నాకు కోపం.

స—ఇంకా ఉత్తరాలుకుడా నీ పాత పేరుతోనే వస్తున్నాయేమో!

శా—ఎరగనివాళ్ళ దుండగాలు సహిస్తాను. నువ్వు ఎరుగున్న వాడివికదా! నువ్వు తిన్నగా అందూ!

స—సరే. ప్రయత్నిస్తాను. పోతాను అరుణాచలం! (అని ఎడమ ఎదరకి పోతాడు)

శా—(ఎడమ మధ్యకి చూసి) ఒరేయ్, మాలోకం!

మా—(వస్తూ) ఆ...యు...

శా—ఇందాకా అక్కడికెళ్లి చూసొచ్చావా?

మా—చూసొచ్చానండి.

శా—ఎక్కడికెళ్ళి చూసొచ్చావురా?

మా—(ఎడమ వెనకకేసి చూపెట్టి) ఆవేపునున్న ఎఱ్ఱ స్తంభాలమేడకి.

శా—ఏం జేస్తోంది ఆపిల్ల?

మా—నేనూ వెళ్ళేసరికి, సరిగ్గా, ఏదో చెయ్యాలను కుంటున్నారండి, ఆవిడ.

శా—అబ్బ, అనుకోడం కాదురా, ఏం పని చూస్తోంది ఆ వ్యక్తి?

మా—మీకు మంచిటోపీ అల్లుతున్నారండి.

శా—భేష్. నేను ఊర్నించి వచ్చానని చెప్పావా?

మా—చెప్పానండి.

శా—(కనుబొమ్మలు ఎత్తి) చెప్పగానే ఆ అమ్మాయి సంతోషించిందిరా!

మా—నా దుంపతెగా, నే నామాట అడగడం మరిచి పోయానండి.

శా—ఓరి పశువా, మాటకి మాట జేర్చి కనుక్కో వద్దుట్రా? ఏడిశావులే!...ఊ...ఈపదిరోజుల్నించీ కులా సాగా ఉన్నానందా?

మా—(తల త్రిప్పుతూ) కులాసాగానే ఉన్నారట్టండి. కాని (మొహం ముడుచుగుని) రాత్రెళ్ళు ఏక దోమలుట!

శా—అల్లానా! వెధవ దోమలులే. వాటిని తోల డానికి దాసీని పెట్టిస్తాలే. అంతేనా, మరేమన్నా ఉందా?

మా—అంతేనండి.

శా—(సిగ్గుతో) మా—లో—కం!

మా—(దణ్ణం పెట్టి) అయ్య.

శా—నేను పదిరోజులాయె లేనుగదా, (తల రుబ్బుతూ కళ్ళు మిటకరిస్తూ చిరునవ్వుతో) నాకోసం ఆపిల్ల బాధ పడేదిరా?

మా—తెగ బాధపడ్డారండి! నే వచ్చినంత ఒట్టండి. అసలు ఆమేడపక్కనించి ఏగుర్రం, గాడిద, కంచరగాడిద—ఏది వెళ్ళినాసరే ఉలిక్కిపడి, ఒకవేళ వచ్చింది. మీరేమో అని చూస్తూండేవారు.

శా—అల్లానా! చూస్తూఉండేదేం పాపం! ఘోర! ప్రేమగావును! (అని తల ఊగిస్తూ)...ఆగు...(ఎడమ ఎడరకేసి నిదానిస్తూ) ఎవరో నాకోసం వస్తున్నారు. నువ్ తప్పుకో!

(ఎడమ ఎడరనించి "ఏమండోయ్" అని కేక విన పడుతుంది.)

మా—(ఎడమమధ్యకి పోతాడు.)

సీ—(ఎడమ ఎడర్నించి వచ్చి) ఏమండోయ్, శాన...

శా—(దీర్ఘంగా ముఖంకేసి చూసి ఆశ్చర్యంతో) ఆఁఆఁ...సీహారం! అవునా?

సీ—అవునండి, శానయ్యగారు!

శా—చాలా సంతోషం. రా, కూచో. ఎన్నాళ్లాయి వచ్చావ్, ఈఊరూ?

సీ—ఓ వారం అయింది.

శా—అబ్బా, అల్లానా!

సీ—ఎప్పటికప్పుడు ఇక్కడ మిమ్మల్ని కేకేసేవాణ్ణి. తీరసేవారు.

శా—పొలాలమీాది కెళ్లాను ఈమధ్య!

సీ—పదిరోజులైందిగావును మీారెళ్ళి!

శా—అవును. కిందనమాటు చూసినప్పుడు నువ్వు (పొట్టి అని నేలమీాంచి ఎత్తు సూచిస్తూ) ఇంత ఉండే వాడవ్, ఎదిగావుస్మీ!

సీ—అయిఉంటుంది.

శా—సరే, నాన్నగారు-శాటయ్యగారు క్షేమమా!

సీ—ఆ, మీా దయవల్ల.

శా—ఆయన నాకు చాలా స్నేహితుడు. కొన్నాళ్ళాయె మేం కలియలేదు.

సీ—ఉత్తరాలుకుడా రాసుగోలేదేమో!

శా—లేదు. ఆయన ఇంకా చలాకీగా పన్లూ అవీ చూస్తున్నారా!

సీ—ఆ. మీాకోఉత్తరం రాశారు. ఇదుగో. (అని ఉత్తరం ఇస్తాడు.)

శా—ఓ. ఆయనమాట శిరసావహిస్తాను. నువ్వు ఉత్తరంకుడా తేవాలీ ఆయనదగ్గిర్నించీ! కాకిచేత కబురం పిస్తే ఆయనపాదాలదగ్గిర వాలనూ!

సీ—నిజమే కావచ్చు కానండి, పరిచయం కలిగించుకోకుండా వ్యక్తుల్తో వ్యవహరించే అలవాటు నాకులేదు... మహోత్తరం రాశారు.

శా—ఎదీ?

సీ—తీసుకురాలేదు. మానాన్నకి పెద్ద స్నేహితుడున్నాడట. సంతోషంట ఆయనపేరు. ఆయన్ని మీరెరుగుదురా?

శా—ఎరగను.

సీ—అల్లానా! అయినా భయం లేదులెండి. ఆయన దేశాంతరంనించి వచ్చాడట. వాళ్ళిద్దరూ ఒక ముఖ్యమైనపని మీద. ఇక్కడికి వస్తున్నారట, నేడో రేపో!

శా—అవశ్యం వారికి స్వాగతం ఇస్తాను. ఇప్పుడు సంగతేమిటి?

సీ—నాకు ఒక నూరురూపాయలు కావాలి.

శా—సంతోషంగా ఇస్తాను. (అని కుడిమధ్యకివెళ్ళి అప్పుడేవచ్చి) ఇదుగో, ఈసంచీతోకూడా పుచ్చుకో. నేను కాటయ్యగారి పుత్రుడికి సమయానికి అనుకూలించడంకంటె నాకేంకావాలి!

సీ—మీకు ఇది మళ్ళీ...

శా—అబ్బ...అల్లా ఉండనిస్తూ, చూసుకోవచ్చూ! —సరి, నీకు ఈ ఊ రెల్లా ఉంది?

నీ—మంచి జనం, మంచి భవనాలు, మంచి వినోదాలు చాలా బాగుండండీ?

శా—అందులోనూ, ఎవరి అభిరుచికి తగ్గ వినోదాలు వారికి దొరుకుతాయి, ఇక్కడ! ఇక్కడి స్త్రీల రకాలు చూశావా? (అని స్మితం చేస్తాడు)

నీ—కొంచెం చూశానండి.

శా—ఇక్కడి స్త్రీలు సహజప్రౌఢలు కావడంచేత రసికశిఖామణులకోరికలకి ఇక్కడ పంట! వ్యక్తులే వ్యక్తులు, వేషాలే వేషాలు, చేష్టలే చేష్టలు—అంతా నవీననాటకం తంతు! ఇంతట్లో ఏంచూశావ్, ఈ మహానగరంమజా! నువ్వా స్ఫురద్రూపివి. నిలువెత్తుధనం పోస్తే దొరుకుతాడా నీబోటిగాడు? నిన్నుచూసింతరవాత ఏ మిటారిభార్యమనస్సు పట్టగలదూ? నీకు కుదిరిందా ఏదేనా బేరం? నీ వ్యాపారం జయకరంగా ఉందా?

నీ—(తల వంచి, చేతులుకట్టి, కాలు ఆడిస్తూ) ఒక బేరం జరిగిందండీ, తమరు పెద్దలు ఎల్లా చెప్పడంమరీ!

శా—సరిసరి. (పెళ్లి భుజం తట్టి) నాన్నా నేనూ స్నేహితులం, చెప్పవోయ్! నేను మరో ఉదాహరణ నా గ్రంథంలో రాసుకుంటానూ!

నీ—మీరు ఈసంగతి రహస్యంగా ఉంచాలి.

శా—తప్పకుండా!

నీ—ఇల్లాంటి రహస్యాలు పొక్కితే, అసలు వాళ్ల ఆశలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి అని మీకు తెలుసుగదా! వినండి. మరి దాచకుండా చెప్పేస్తాను. ఒక సుందరిమీదికి నా మనస్సు వాలింది. నా ప్రథమ సూచన్నవల్ల పనిజరిగింది. ఆవ్యక్తి నాకు స్వాగతం ఇచ్చింది. బడాయీ కాదు, ఆవిణ్ణి యూగీ చెయ్యడమూ కాదు గాని. వ్యవహారం బాగానే నడుస్తోంది.

శా—బలేబలే! (అని నవ్వుతూ) ఎవరోయ్, ఆ భువన సుందరీ?

నీ—(ఎడమమూల చూపించి) ఆ వేపున ఎర్రరస్తం భాల మేడలో ఉంది ఒక పిల్ల—ఆసుందరి! ఆవిడ చాలా అమాయికురాలు. ఎవడో తెలివిమాలినవాడు ఆవిణ్ణి ప్రపంచానికి దూరంచేసి అల్లా తయారు చేశాడట. అయినా సరే ఆవిడయొక్క మహత్తరమైన ముఖతేజమూ, మనోహరమైన దృష్టివైఖరీ జనాన్ని ఆకర్షిస్తాయి, నన్ను లాగేశాయి! ఆమెపేరు చంద్రప్రభ. ఆమె ప్రేమనిధీ, ప్రణయతార.

శా—(కళ్ళు తేలేసి పక్కకి తిరిగి దిగాలుపడి) అయ్యో అయ్యో! నా మొహాన్ని బట్టి పోల్చుకోడుకద

నీ—(చేతి రుమాలు తీసి ముఖం అద్దుకుని) ఇక, ఆవిణ్ణి తెచ్చినవాడు ఘూర్ణాచలమో కర్ణాచరమో ఎదో పేరుటండీ. వాడికి డబ్బుందిట గాని, బుద్ధిలేదని విన్నాను. బుద్ధిలేకపోడంలోనూ ఎల్లా అనుకున్నారూ, పరిపూర్ణ మూర్ఖుడనే తెలిసింది. మీరెరుగుదురండీ వాణ్ణి!

శా——(తనలో) ఈ చేదుమాత్ర ఎల్లా మింగడం!

సీ——ఎరుగుదునా లేదా అని ఆలోచిస్తున్నారా ఏమిటి?

శా——లేదు లేదు...వా...ణ్ణి...ఎరుగుదును...

సీ——వాడు పరమశుంఠ కాడంటారా?

శా——(నోరు వెళ్లబెట్టి) హాఁ (అని ఏడిచినట్టునవ్వి అవు నన్నట్టు తల ఊగిస్తాడు.)

సీ——అవునా, నిజమేనాండి, అదే నే విన్నదీనూ! ఆ కాకికి ఓ దొండపండా? ఆ మసిపాతని ఓ వజ్రమా? నేను ఒప్పను. ఆవిడ నా హృదయాన్ని హరించింది. ఎంతపనేనా చేసి, ఆ అను మానవ యాజమూని కంటో దుమ్ముచల్లి, ఆవిణ్ణి నేను చేపట్టడం నాకు విధి.

శా——(ఏమీ తోచక) అల్లానా! నీకు వీలు కావద్దూ!

సీ——సరే, వీలంటే డబ్బేండీ! అందుకోసమే ఇప్పుడు మీ దగ్గిర డబ్బు తీసుగుంటా!...అయ్యా, ప్రేమయుద్ధం కానీండి, ద్వేషయుద్ధం కానీండి, నెగ్గాలంటే కీలకం డబ్బే! ...మీరు ఎల్లానో ఉన్నారు...పోనీ, వెళ్ళి మళ్ళీ రానా?

శా——అబ్బెబ్బే, నేనేమని ఆలోచించానంటే...

సీ——మీరు చాలా అలిసినట్టున్నారు. మళ్ళీవచ్చి సంగతి చెప్పిపోతాను. కృతజ్ఞుణ్ణి. సెలవ్ (అని ఎడమ ఎదరకి వెళ్ళబోతాడు.)

శా——అయితే...విధిగా...

నీ—మరే, విధిగా ఈ రహస్యం మీరు దాచాలి. (అని వెళ్ళబోతాడు.)

శా—నాచిత్తవృత్తినిబట్టి...

నీ—(మళ్ళీ వచ్చి) అన్నిటికంటె ముఖ్యం ఏమిటంటే, మానాన్నతో ఇది మీరు అననేకూడదు. జాగర్త సుమండి, ఆయనకి కోపం రావచ్చు. (అని ఎడమ ఎదరికి నిష్క్రమిస్తాడు.)

శా—(నీహారం వెళ్లిన వేపు చూస్తూ) హారి! నా మనస్సుకి ఏంక్షోభ కలిగించావురా చచ్చినాడా! నీ సంభావన తగలెయ్యా!...పైగా అందుకోసమేట నాదగ్గిర డబ్బు తీసుగుంటా! వీడి పొగరూ, వీడి తొందరా వీడి ఎద్దంలానేఉన్నాయి, లేకపోతే, ఈకథట్టుగొచ్చి నాతోనా చెప్తాడు వీడు! నాకొత్తపేరు ఎంత తెలియకపోయినా ఇంత చవటకుంకలాగ దూడేసేవాడు మరి ఉండడు. కాని, ఈదౌర్భాగ్యుణ్ణి చివరిదాకా పేలనియ్యవలసింది, ఏం కూసేవాడో! నా భయాలన్నీ యథార్థం అని తేలిపోయేదేమో!...(దీనంగా) వీళ్ళకి మాటలుకూడా జరిగాయేమో పీనుగులు! సరే, ఓపని చేస్తా. మెల్లిగా బెల్లించి, వీడికి మనస్సిచ్చినట్టునటించి నమ్మకంపుట్టించి, అరుణాచలం అనేది నేపెట్టుగున్నపేరే అని వీడికి తెలియకుండా జాగర్తపడి, గ్రంథం యావత్తూలాగేస్తా. అమ్మకుంకా!...కాని, ముందు ఈ మాలోకంగాణ్ణి తన్నాలి. ఒరేయ్! మాలోకం!

మా—(ఎడమమధ్యనించి వచ్చి నవ్వుతో) ఏమండి అయ్యగారు!

శా—నీ చావు మూడిందిలే, దగ్గిరికిరా! (అని అరుస్తాడు)

మా—(బిక్కమొహంతో) మిమ్మల్ని చూస్తే భయం వేస్తోందండి, (కొట్టినట్టు ఏడుస్తూ) బాబో బాబో!

శా—గోల చెయ్యకు. దగ్గిరికిరా. రావేంరా? (అని పళ్లు కొరుకుతాడు)

మా—మరి చంపేసేట్టున్నారండి.

శా—అప్పుడే చంపను, ముందు చెప్పు. నేనూళ్ళో లేనప్పుడు, నే చెప్పినప్రకారం చేస్తానని నన్ను దగాచేస్తావురా?

మా—నేను దగా చెయ్యలేదండి, అసలు ఏమీ కూడా చెయ్యలేదండి. (అని వెనక్కి వెళ్ళబోతాడు)

శా—అదేమిటి, వెనక్కి నడుస్తున్నావా! పారిపోతే సరనా! పారిపోతే ఎం జేస్తానో తెలుసా? వెంటనే చాకుతో పొడిచేస్తాను...(మూలుగుతూ) అయ్యో! నే బాధలో ఉన్నానురా, దిక్కుమాలాడా, మాట రావటంలేదునాకూ, కంఠం స్తంభిస్తోంది. (గట్టిగా) కదిలావంటే చంపేస్తా. ఆగు. (ఉడుకు మోత్రనంతో) కూసం విడిచినట్టు శరీరం విడిచెయ్యాలని ఉంది నాకు! కాని, వీల్లేదాయిరి! (కాపీగా) నే లేనప్పుడు, చంద్రప్రభ మేడమీదికి, మనిషిని వెళ్ళనిచ్చావా లేదా? కదలకు కదిత్తే పోతావు స్వర్గానికి. చెప్పు. అసలు వాడెల్లా ప్రవేశించాడు, లోపల?

మా—(మోకరించి దణ్ణం పెడుతూ) ఒట్టండి, ఒట్టండి...(తనలో) ఈయన్ని ఏ పిచ్చికుక్కో కరిచింది.

శా—అబ్బబ్బ, శోష వస్తోంది. సర్దుకుని నిదానించాలి...ఒరేయ్ నువ్వెళ్ళి...పోస్లే వద్దు. అవతలికిపోయి కూచో.

మా—అంత కోపం ఏమిటండీ! (అంటూ సణుక్కుంటూ ఎడమమధ్యకి పోతాడు)

శా—(లేస్తూ) ఆ కత్రకుంక ఇల్లాంటి అసాధ్యం నాకు తెస్తాడనుకోలేను. నా గుండె పిండైపోయింది. అయినా తప్పదు. ఈపాడు వ్యాపారంలో నిజం ఎంతవరకో దాని నోటంటే వింటాను. నేను కోపం చంపుగోవాలి, చంపుకుంటాను మరి. అకస్మాత్తుగా వెళ్ళి ఆపిల్లని అడిగేస్తాను. (గుండెలు బాదుకుంటూ) హాయ్యో హాయ్యో! చిన్న కుర్రాడవనుకున్నాన్రా శాటయ్యగారి సుపుత్రుడా, నాకొంప తీశావురా, అభాజనుడా! (అంటూ ఊసూరుమని కాళ్లీడుస్తూ కుడిమధ్యగా నడిచిపోతాడు)

---

## రంగం - 2

చంద్రప్రభని పెట్టిన మేడ.

శా—(కుడిఎదర్నించి వచ్చి ఎడమ మధ్యకేసి వెళ్లి) చంద్రప్రభా! (అని పైకి చూసి పిలిచి) కిందికిదిగి ఇల్లారా!

చం——(ఎడమ మధ్యనించి వస్తుంది)

శా——ఇవతల హాయిగా లేదూ!

చం——(నవ్వు మొహంతో) ఉంది.

శా——గాలి సుఖంగా ఉందిస్మీ!

చం——చాలా.

శా——విశేషాలేమిటి?

చం——పిల్లి పిల్ల చచ్చిపోయింది.

శా——పిల్లిపిల్లలు చచ్చిపోతూంటాయిలే, ఎంజేస్తాం! ...నే లేనప్పుడు వర్షం కురిసిందా?

చం——చూడలేదు.

శా——నీకు ఉసూరుమనిపిస్తోందా?

చం——నా కెప్పుడూ ఉసూరుమనిపించదు.

శా——ఈ పదిరోజులూ రెమొ, ఏమేం జేశావ్?

చం——ఆరు చొక్కాలు కుట్టాను, ఆరు టోపీలు అల్లాను.

శా——(ఎడమమధ్యకి వెళ్ళి చిన్న కుర్చీ తెచ్చి ఎడమ ఎడరవేసి చంద్రప్రభని కూచోమని సంజ్ఞచేసి, ఇంకోటి తెచ్చి పక్కగా వేసుకుని తను కూచుని) ఈ ప్రపంచ మంతా అదో చిత్రం సుమా, చంద్రప్రభా!

చం——ఎంచేతా?

శా——ఎవళ్ళుమాట్లాడినాఅపవాదలేమాట్లాడతారు.

చం——ఎవళ్ళు వాళ్ళూ?

శా—ఒకళ్లేమిటే, అంటావూ! నే లేనప్పుడు ఇక్కడికి ఒక యువకుడు వచ్చినట్టు ...

చం—ఊఁ.

శా—నువ్వు వాణ్ణి రానిచ్చి వాడితో ప్రసంగించినట్టూ... చుట్టుపక్క వాళ్లూ...

చం—ఊఁ.

శా—కొందరు చెప్పారు. అయితేం? (చిరునవ్వుతో) నేను ఏమీ నమ్మలేదు. ఎవడూ రాలేదని, కావలిస్తే, పందెం కాస్తానన్నాను.

చం—(నవ్వుతూ) కాశారుకాదు నయమే, కాస్తే, మీరే ఓడిపోయి ఉందురు.

శా—అయితే, నిజంగా, ఒక యువకుడు రావడం...

చం—(చలాకీగా) ముమ్మాటికీ నిజం! అతడు వచ్చి ఓపట్టాన వెళ్ళందేనా!

శా—(తనలో) అల్లా తెగేసి పబ్లిగ్గా చెప్పేస్తుందే! నిష్కల్మషం అన్నమాట. (పైకి) అయితే ప్రభా! ఎవళ్ళనీ నువ్వు చూడకూడదని నేను ఆర్డరు వేశానే!

చం—నే నెందుకు చూడవలిసొచ్చిందో మీరెరగరు. ఎరుగుంటే, మీరూ అంతేచేసి ఉండేవారు.

శా—అదోటా! సంగతేమిటో చెప్పు.

చం—నే మేడమీదపని చూసుగుంటున్నాను. అతడు కిందనిలబడి, నేను తనకేసితిరగ్గానే చేత్తో (నుదురు ముట్టు

గుంటూ ) ఇల్లా అన్నాడు. ఊరుకుంటే మర్యాదకి భంగం అనుకుని నేనూ ( అభినయిస్తూ ) ఇల్లా అన్నాను. అతడు వెళ్లి మళ్ళీవచ్చి ( అభినయిస్తూ ) ఇల్లా అన్నాడు. మోటు మనిషిని కానసే దాఖలాకోసం నేనూ ( అభినయిస్తూ ) ఇల్లా అన్నాను. అతడు మళ్లీమళ్లీ వచ్చి ( అభినయిస్తూ ) ఇల్లానే అన్నాడు. చీకటిపడడంవల్లగాని, లేకపోతే అతనూ నేనూ (అభినయిస్తూ) ఇల్లా ఇల్లా అంటూ ఉండిపోయేవాళ్ళమే!

శా—( తనుకూడా తన నుదురు మొట్టుకుంటూ ) ఇల్లానే ఉంది సరిగ్గా!

చం— మొన్నాను పొద్దున్న పరుగులాంటి ముసిల్ది ఒక త్రైవచ్చి, దేవుడు నాకు అందం ఇవ్వడం వ్యర్థంచేసుగో మని కాదు, అంది. పైగా, నేను ఒక హృదయాన్ని గాయ పరిచానంది.

శా—గాయపరిచావందీ! (తనలో) ఆసి సైతాను నక్క శని ముసిలీ!

చం—నే నేమీ వినరందే గాయం ఎల్లా పడింద న్నాను. అంటే, ముసిల్ది నీ కళ్ళల్లో ఉంది సంగతంతాను. నువ్వుకళ్లతో చూపులు విసిరావు. బహుశా కళ్ళవిషం అత నికి ఎక్కుగుండెని గాయపరిచింది గావును. దాంతో అతడు మూర్ఛిల్లాడు, రెండురోజుల్లో చచ్చిపోతాడు—అని చెప్పింది. అయ్యో అయ్యో, పాపం అత డెల్లా బతుకుతా డన్నాను

నేను, అంటే, దాని ధర్మనూ అని ఆ ముసలమ్మ ఓ ఉపాయం చెప్పింది.

శా—ఉపాయంకూడా చెప్పిందీ! (తనలో) దాని ఉపాయాన్నీ దాన్నీ వేరేవేరే తగలేసిరి, దాని మొహంమండా!

చం—నీకళ్లల్లోనే అతణ్ణి గత్తించే మందు ఉంది. అతణ్ణి రానిచ్చి అతన్తో మాట్లాడు—అంది. నేను సగే అన్నాను.

శా—(తనలో) ఆసి మహామ్మారి ముసిలీ, నీకు సవార్రీకట్టా, నీకు నరక మేసే పీనుగా!

చం—అతణ్ణి రానిచ్చాను. అల్పప్రాణి గురించే బాధ పడతానుగదా, అంత నిండు ప్రాణం నామూలాన్ని పోతూంటే ఊరుకోనా ?

శా—(తనలో) అమాయికత్వంవల్లే వచ్చింది ఈ చిక్కు! అదీ కాదు. నేను 'తెలివిమద్దెవు చవటని కాకపోతే, దీన్ని ఒంటరిగా వొదిలి ఊరి కేడవడం ఏమిటీ! మొగాళ్లు కని పెట్టారు...ఆకుంక మరేమీ హద్దుమీర లేదుకదా అని భయం వేస్తోంది.

చం—మీరల్లా ఉన్నారేం? పసిగత్తిందా? నే చేసినదాల్లో తప్పు ఏమన్నా ఉందా?

శా—(కొంచెం ఉత్సాహం తెచ్చిపెట్టుగుని) అబ్బెబ్బే! తప్పు లేదు, తప్పు లేదు. ఆ యువకుడు ఏమన్నాడు, ఏం జేశాడు?

చం—చాలా సంతోషించా నన్నాడు.

శా—(తనలో) వెధవ.

చం—తన వ్యాధి పోయిం దన్నాడు.

శా—(తనలో) రోగం, దిక్కుమాలాడికి.

చం—(నవ్వుతూ) నా కతను తెచ్చిన బహుమతీ, మాలోకానికి అత డిచ్చిన డబ్బూ ఇవన్నీ చూస్తే, మీా రతణ్ణి ఎంత మెచ్చుగుని...

శా—నేనూ అతణ్ణి ఏకంగా చివరకి మెచ్చుతాలే, ఇంకా చెప్పు.

చం—నన్ను ప్రేమించా నన్నాడు. అల్లా ఎవ్వర్నీ లోకంలో ప్రేమించలే దన్నాడు. మనోహరమైన సంగతులు చెప్పాడు. అవన్నీ వింటూంటే నిజంగా, ఒళ్ళు గగుర్పొడి చిందండీ. నమ్ముతారో లేదో, నేను పుట్టింతరవాత అటు వంటి తుణం ఎరగనండీ.

శా—(తనలో) ఔర, దుర్దశ! సమాధానంవల్ల బాధపడేది నే నొక్కణ్ణే, ప్రశ్న అడగవలిసొచ్చిందీ నేనే! (పైకి) అది సరే చంద్రప్రభా! మాటలు సరి. ఇంకా నిన్ను గౌరవించలేదూ వాడూ!

చం—నా చెయ్యి ముద్దుపెట్టుగున్నాడు. అతడికి వినుగే లేదు.

శా—ఇంకా ఏమైనా తీసుగున్నాడా?

చం—ఆ...(ఎదో జ్ఞాపకం చెయ్యడానికి లాగ

తర్జనితో వెనక్కి సూచిస్తుంది.)

శా—(కోపంగా) ఏమిటీ?

చం—అతడు...

శా—అయ్యో!

చం—ఆ...

శా—చెప్పు.

చం—(చెప్పబోయి) ఏమో! మీరు కోప్పడేట్టున్నారు.

శా—కోప్పడను.

చం—ఒట్టే?

శా—ఒట్టున్నర.

చం—అతడు ఏం తీసుకున్నాడంటే, ఆ...మీకు కోపం లేదుగద!...

శా—లేదు.

చం—(మూతి ముడుచుకుని) పోన్లెండి, కోపం గావును?

శా—కోపం లేదు, లేదు, లేదు! చంపక చెప్పెయ్!

చ—అతడు...(అని గుటక వేస్తుంది)

శా—(తనలో) దైవమా! ఏమిటో అనుకున్నాను గాని, నరకం చూడ్డానికి వేరే చావక్కర్లేదు.

చం—అబ్బ వినండీ. మీరు నా జడకి ఓకొత్త రిబ్బను కొన్నారే, ఆకొత్త రిబ్బను అతడు తీసుకుపోయాడండి! వద్దంటే విన్లేదు.

శా—ఇక్కడికి చంపేశావ్! దిక్కుమాలిరిబ్బనేస్తూ దిక్కుమాలి రిబ్బనూ! సరే. ఇంకా ఏమిటి కోరుతున్నాడు?

చం—ఇంకా ఏ ముంటుందీ?

శా—రోగంకాదు వాడికీ, అది కుదరడానికి కోరుకున్నాడని!

చం—అతడు మరేమీ కోరలేదు. ప్రాణాపాయం తప్పిపోయిందిగా!

శా—చాలు చాలు, ఇక్కడికి కృతార్థులమే. నువ్వెరగవు ప్రభా! మోసగాళ్ళు ఇల్లానే చేస్తారు. మొదట ఇల్లానే స్తోత్రాలు చేసి, తరవాత హేళన చేస్తారు.

చం—అబ్బే! ఇది మోసం కాదు, స్తోత్రంకాదు, హేళనకాదు—అని అతడు బోలెనుసార్లు చెప్పాడు.

శా—అయినాసరే ప్రభా! చెబుతున్నాను. నువ్వు ఎవ్వాళ్ళనీ నమ్మకూడదు నన్నుతప్ప! పైగా సలాములు, చూపులు, బహుమతులు, వినడాలు, స్పర్శలు, ముద్దులు—ఇవన్నీ ఘోరమైన పాపాలు! జాగర్త.

చం—పాపాలా? అయ్యో! ఏం?

శా—అవన్నీ అంటే దేవుడికి మహాచెడ్డ ఒళ్లుమంట!

చం—ఇంత మధురం, ఆకర్షణీయం అయినా వ్యావహారంగురించి దేవుడికి అంత ద్వేషం ఎందుకు కలిగిందో?

శా—ఈ వ్యవహారం మధురంగా ఆకర్షణీయముగా అనేసంగతి నాకు చెప్పనక్కర్లేదు, నాకూ తెలుసు. కాని,

అది నియమప్రకారం ఉండాలి. లేకపోతే చాలాదోషం. తెలిసిందా? పెళ్లితో ఆ దోషం పోతుంది.

చం—పెళ్లితో ఆ దోషమే ఉండదూ?

శా—ఉండదు.

చం—అల్లాయితే పెళ్లి కానియ్యండి.

శా—నువ్వు కోరేది పెళ్లే అయితే, నేకోరేది పెళ్ళే! నేను పెళ్లిగురించి చెప్పెయ్యడానికే వచ్చానసలు!

చం—(సంతోషంతో) నిజంగానాండీ!

శా—(సంతోషంతో) నిజంగా.

చం—నాకు ఎంత సౌఖ్యం ఇచ్చినవారవుతారను కున్నారు మీరు!

శా—పెళ్ళి నీకు సంతోషదాయకం కాక పోతుందా అని అంచనా వేశాను.

చం—అల్లాయితే, ఇద్దరమూ...

శా—నిస్సందేహంగా...

చం—ఆ సంగతే నిజమైతే, సంతోషంతో మిమ్మల్ని లాలిస్తాను.

శా—నేనూ అంతే. ఆనందంతో నిన్ను లాలిస్తాను.

చం—(తొందరగా) నిజమేనండీ! వేళాకోళం అంటే నాకు తెలియదు చెప్పండీ! మీరు మనసారా...

శా—అవును. మనసారా చెబుతున్నాను.

చం—పెళ్ళిమాట రూఢే అంటారా?

శా—అవునంటే! రూఢి.

చం—అయితే, ఎప్పుడూ?

శా—ఈసాయంత్రమే.

చం—(నవ్వుతూ) అహాఁ, ఈ సాయంత్రమే!

శా—ఆ. కేవలం ఈ సాయంత్రమే. అంటే, నీకు నవ్వొస్తోందా?

చం—మరే.

శా—ఎల్లాగైతేం నీకు సంతోషం కలగడంకంటె రెండోది నా కక్కర్లేదు.

చ—అయితే మీాకు యావజ్జీవమూ మొక్కుతాను ...ఎంచేతంటే, ఎంతేనా సౌఖ్యం అతనితో నాకు పెళ్ళి!

శా—అతనితో ఏమిటే? (అని లేస్తాడు)

చం—అతనంటే...ఆ అబ్బాయితో. (అని లేస్తుంది)

శా—(తిప్పుగుంటూ) ఆ అబ్బాయితో! అల్లానే ఉంది. ఇందాకణ్ణించీ నే మాట్లాడింది వాడితో నీకు పెళ్ళని కానే కాదు! భర్తవిషయంలో నీకు తొందరకూడదు. నీకు మంచివాణ్ణి ఒకణ్ణి నేను ఇదివరకే చూసేసిఉంచేశాను, సర్వ సిద్ధంగా! ఇక, వాడున్నాడే ఆ అబ్బాయి! వాడి ప్రస్తుత వ్యాధితో వాడసలు టపాకట్టేస్తాడు. ఒకవేళ వాడల్లా చెయ్యకపోయినా, నీకు వాడి ప్రమేయం వద్దు. గుమ్మంలోకి వస్తే ఫెడీమని తలుపు వేసెయ్! తలుపు తియ్యమంటే కిటికీ

లోంచి రాయి విసిరెయ్ ? తెలిసిందా ? ఇక్కడ వాడు కాలెట్టకూడదు. నిన్ను వెయ్యి కళ్ళతో చూస్తూంటాను. జాగర్త.

చం—అతడు చాలా అందంగా ఉంటాడండీ!

శా—మరి వాగుడు వద్దు.

చం—నాకు ధైర్యం ఎల్లా వస్తుందండీ...అతణ్ణి...

శా—పై వెళ్ళిపో! మరేమీ విన నివ్వడు.

చం—మీ రిదంతా నిజంగా...

శా—చాలన్నాను. నేను యజమానిని. (చెయ్యి చాచి ఆజ్ఞనూచిస్తూ) వెళ్ళు. చెబుతున్నాను, విను. (అని నెమ్మదిగా చెయ్యి దింపుతూండగా, చంద్రప్రభ కొంచెం కోపంగా ఎడమమధ్యకి మెల్లిగా వెళ్ళిపోతుంది. శానయ్య, నెగ్గినవాడికిమల్లే అభినయించి, కుడిఎదర కేసి తిరిగి, సరే వాడి పని పడతా నన్నట్టు తర్జనితో బెదిరించుతూ కుడిఎద రకి పోతాడు)

---

## రంగం-3

### చంద్రప్రభని పెట్టిన మేడ

[కుడిఎదర్నుంచి శానయ్య వచ్చి, ఎడమఎదర కేసి నడిచి, రమ్మని సంజ్ఞ చెయ్యగా, ఎడమఎదర్నుంచి మూలోకం వస్తాడు. వాణ్ణి రహస్యంగా కుడిఎదర దగ్గరికి తీసికెళ్ళి ]

శా—వాడు మళ్ళీవచ్చాడురా ?

మా—(నవ్వుతూ) వచ్చాడండి

శా—నవ్వుతా వేం ? చిత్రకొట్టేసు గనక!

మా—ఆయన రావడంతోటే ప్రభగారు తలుపు ఫడేమని వేసేశారండీ! (అని ఇంకా నవ్వుతాడు)

శా—బలే. వాడు తలుపు తియ్యం డని కేకెయ్య లేదూ ?

మా—మానాడాండీ. కేకేశాడు. ఆమట్టున ఆవిడ కిటికీ దగ్గరి కొచ్చి, ఇంత రాయిచ్చుగునీ, ఆయన్ని చావ గొట్టింది.

శా—భేష్ మొహాం బద్దలై ఉంటుంది వెధవకి. సిగ్గుంటే ఈపాటి వాడు చచ్చిపోయుండాలి.

మా—అబ్బే, వాడికి సిగ్గులేదండీ. నాకు మారని డబ్బులిచ్చాడు, చచ్చినాడూ!

శా—ఇదోటా ? సర్లే, నువ్వు పుచ్చుగున్నావా ?

మా—ఏం జేసుకుంటానూ, మారనివీ!

శా—మారేవైతే ?

మా—మారేవైతే పుచ్చేసుగుంటాను.

శా—(వాణ్ణి కొట్టబోయి) అదిట్రా నీతో చెప్పిందీ?

మా—బాబో బాబో. అదికాదండీ. పుచ్చుగునీ... పుచ్చుగునీ...వాణ్ణి తరిమేస్తాను.

శా—(తగ్గి) అదా. అల్లో చెయి. తెలిసిందా ?

మా—చిత్తం.

శా—సరే. నువ్వెళ్లి పురోహితుణ్ణి నే రమ్మన్నానని కేకేసి, ఇంటిదగ్గి రుండు.

మా—చిత్తం. ( అని కుడిఎదరికి వెళ్లిపోతాడు )

శా—(ఎడమ మధ్యకి నడిచి "ఏయ్ చంద్రప్రభా" అని కేకేసి చప్పట్లు కొడతాడు )

చం—(ఎడమ మధ్యనించి చిన్నకుర్చీ తెచ్చి అతడికి వేసి ఒకటి తెచ్చి తను వేసుగుని కూచుంటుంది. కుట్టుపని చేతులో పట్టుగుని ఉంటుంది. )

శా—ప్రభా! విన్నాను. వాణ్ణి నువ్వు బెడ్డ పుచ్చుగుని కొట్టావే, అందుకు చాలా ఆనందించాను. అదే పద్ధతి. సరి. ఇటుచూడు నా కేసి. జాగర్తగావిను. ఆపని దూరంగా పెట్టు.

చం—కుట్టుపని ఎడమ మధ్యకి పారేస్తుంది. )

శా—నేను స్వయంగా నిన్ను పెళ్లాడబోతున్నాను! నీ అల్పస్థితికి నాఅంతవాడు దొరకడం నీపుణ్యం. అనేక స్త్రీలని తిరస్కరించిన ఘటాన్ని నేను. అల్లాంటివాడనైన నేను అధోలోకంలోంచి నిన్ను కనికరంతో ఉద్ధరించాను. ప్రభా! తెలిసిందా?

చం—అధోలోకం ఏమిటి! ఆ ఊర్నించి ఈ ఊరొచ్చానూ! అంతేగా!

శా—అంతే కాదు, ప్రభా, శ్రద్ధగా విను. పెళ్లంటే మజాకాకాదు, పెద్ద బాధ్యత గొప్ప భారం.

చం—సంతోషదాయకం కాదూ?

శా—ఆసంగతి చెప్పలేం. పెళ్లి అంటే ఇద్దరి ఏకత్వం అయిద్దరూ సమం కారు. ఒకరు చెప్పాలి, రెండోవారు వినాలి ఒకరు ఆజ్ఞాపించాలి, రెండోవారు అనువర్తించాలి. ఒకరు పాలించాలి, రెండోవారు పాలింపబడాలి. ఎంతో మచ్చికా, అనుకూల్యం, వినయం, గౌరవం, భక్తి చూపించి, భార్య తన మొగుణ్ణి నాయకుడుగా, ప్రభువుగా, యజమానిగా, దైవముగా ఆరాధించాలి.

చం—అని ఎవరు చెప్పారూ?

శా—నాబోటి పెద్దలు! భర్త తీవ్రంగా చూస్తే (అభినయించి) ఇల్లాగ భార్య (అభినయించి) సిగ్గుపడాలి. ఈకాలంలో చాలమంది భార్యలు తగ్గ సిగ్గుచూపించటం లేదు. నువ్వు రేపణ్ణించి అల్లా కాకూడదు. పెళ్ళిఅయిన తక్షణం నువ్వు నాలో సగం అవుతావు గనక నాగౌరవం కాపాడాలి. తుంటరి స్త్రీలని దేవుడు అమాంతంగా ఉడుకునీళ్ళ డేగిసాల్లో ముంచేస్తాడు.

చం—(భయపడి మూతిమీద చెయ్యి పెట్టుగుని) అయ్యో, పాపం! అయితే, దేవుడూ, తుంటరి పురుషుల్ని ఎంజేస్తాడండీ?

శా—వాళ్లనీ దేవుడు ఎదోఓటి చేసేస్తాడు. అదంతా వేరే విషయం. పైగా నీ విషయం కానేకాదు. ఇది మాత్రం

అక్షరాలా నిజం ఇల్లాంటి సంగతులు నువ్వు కంఠతాపట్టాలి. ఇవి మననం చేసుగుని జాగ్రత్తగా ఉంటావా నీకీర్తి తెల్లగా ప్రకాశిస్తుంది. లేక తుంటరివి అవుతావా, నీకీర్తి మాడిపోయి బొగ్గులా అవుతుంది. ఉండు... నాదగ్గిర ఓ కాయితం ఉండాలి...( అని జేబూ వెతిగి ఓకాయితం తీసి ) ఇదుగో, ఇందులో ఒక పుణ్యాత్ముడు భార్యయొక్క విధులు రాశాడు. పుచ్చుగో. ఈకాగితం నీదగ్గర రక్షరేకులా ఉంచుగో. అన్నట్టు మఠంలో నీకు రాయడం నేరపద్దని, చదవడం మాత్రం నేరపమనీ అన్నానే! చదవగలవు కాదూ!

చం—( తల ఊపుతుంది )

శా—చదువ్. ఓమాటు, నీనోటంట, నా చెవులారా ఆరగిస్తాను!

చం—( కాగితం చూసి చదువుతుంది) " భార్యయొక్క విధులు"—" ౧. ఒకడు ఒకతెను పెళ్లాడడం కేవలం తనఒకడి నిమిత్తమే అనే ప్రధానవిషయం భార్య మరవరాదు."

శా—సంపూర్ణవ్యాఖ్యానాలు తరవాత చెబుతాలే. ఇప్పుడు అవి చదివెయ్. తరవాత కూచుని అధమం ప్రతీవాక్యంలోనూ ఉండే ఆయువుపట్లు కంఠతా పట్టిపారెయ్

చం—(చదువుతుంది) " ౨. భార్య వేషం బాగుండడంసంగతి భర్తదే గనక, వాడు వేసుగోమన్న వేషం ఆమె

వేసుకోవలసిందేగాని, ఊళ్ళోవాళ్లు ఆవేషం నవీనంగా లేదంటారేమో అని ముందే ఉరెట్టుగోకూడదు."

శా—(అది వింటూ అభినయిస్తూ ఉంటాడు)

చం—(చదువుతుంది) "3. ఓరచూపులూ, నేత్ర సంజ్ఞలూ, పౌడర్లూ, రంగులూ, వింతకాటుకలూ మొదలైనవాటిని గురించి భార్య నేర్చి పేర్చి కూర్చడం కేవలం భర్తకోసం కాదేమో అనే అర్థం రావచ్చుగనక భార్యవాటిని విసర్జించాలి."

శా—ఈ వాక్యంలో 'కేవల భర్తకోసం కాదేమో' అనేది ఆయువుపట్టు. కానీ.

చం—(చదువుతుంది) "౪. దృష్టిబాణాలతో ఇతరుల్ని గాయపరచవలసిన అవసరం రానియ్యకుండా, భర్త పరోక్షంలో, భార్య తన కళ్లు మూసేసుకుంటే మంచిది."

శా—(చేతిరుమాల్తో అభినయిస్తూ) ఇల్లాకట్టేసుకున్నా సరే.

చం—(చదువుతుంది) "౫. భర్త లేనప్పుడుమాత్రమే ఇంటికొచ్చి, భార్యగారిదర్శనంమాత్రమే కోరేవాళ్లు భర్తకి ప్రతికూలురు గనక, వాళ్ళకి, అప్పట్లో భార్య స్వాగతం ఇయ్యరాదు"

శా—లేకపోతే వాడు తనకి వ్యాధి అంటూ మొదపెడతాడు మరి.

చం—(చదువుతుంది) "౬. ఈ కాలంలో ఏదీ ఊరికే జరగదు గనక, ఇతరులదగ్గిరించి భార్య బహుమతులు పుచ్చుగోకూడదు."

శా—బహుమతీ అంటే ఒకరకం బజానా గనక.

చం—(చదువుతుంది) "౭. ఇంట్లో రాతపని యావత్తూ భర్తే చూడడం కర్తవ్యంగనక, సిరా కాగితమూ కలమూ మొదలైనవి భార్యస్వాధీనంలో ఉండరాదు."

శా—పెనసలూ చాకుకుడా ఉండకూడదు.

చం—(చదువుతుంది) "౮. నాగరికసభ లనబడేటుంటరి కలయికలలో నే అమాయికభర్తలమీద చాటుకుట్రలు పన్నడంజరుగుతుంది గనక, భార్య సభకి వెళ్ళరాదు"

శా—ప్రతినిధుల్నికూడా పంపించకూడదు.

చం—(చదువుతుంది) "౯. భార్యకి జూదంపనికిరాదు."

శా—ఇక చాల్లే అనక అవన్నీ చివరదాకా చదువుకో. వాటిల్లో విశేషార్థాలూ సూత్త్రాలూ నీకు తరవాత బోధపరుస్తాను నాకిప్పుడు ఓపని ఉన్నసంగతి జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడే వస్తాను. లోపలి కెళ్లు.

(చంద్రప్రభ ఎడమమధ్యక వెళ్లిపోతుంది. రెండవ తెర పడుతుంది.)

శా—(రెండవ తెర పడుతూండగా కొసిమూలకి నిర్వమించి, అప్పుడే కడిఎదరనించి నడ్డివిచేతులు

పెట్టుకునివచ్చి ) ఈ విధులన్నీ రాసిందిమనమే. అమాయికు రాలు గనక చదవమంటే చదివింది. మరోమరో మాయ లాడి అయితే ఈకాయితం నా మొహం మీద దాఖలు చేసేది. ఈపిల్లని పెళ్ళాడ్డమే పెళ్ళాడ్డం. మైనంలాంటిది, నా యిష్టం వచ్చిన రూపంలోతయారు చేసుకుంటాను. నేనుఊళ్లో లేకపోవడంవల్ల కొంచెం ప్రమాదంలో పడిపోయింది. మరి ప్రమాదాలు రానియ్యాను. తెలియని ఘటంగనక నిమిషంలో చెప్పగలిగాను. తెలిసిన జంతువైతే చెప్పనియ్యాను సరిగదా నన్ను ఓంభాయుట్టేస్తుంది...ఇక, మనయువకుడు! వీడింకా ఏం జేస్తున్నాడో గ్రహిస్తాను. మనవాళ్ళ దగ్గిర రహస్యాలు దాగుతాయా! వాడే చెబుతాడు...(ఎడమఎదర కేసి చూసి) ...ఇదుగో, ఇల్లావస్తున్నాడు నా కోసమే గావును!

సీ—( ఎడమఎదరనించి వచ్చి ) మీకోసమే వెళ్ళి వచ్చాను. నమస్కారం.

శా—నమస్కారం! ఈ లాంఛనాలు ఎందుకయ్యా పరిచయస్థులకీ! ఏమైంది నియత్నం? అప్పుడు నే నేదో ఆలో చనలో ఉన్నాను. జయమేనా?

సీ—ఏం జయమండీ, వ్యాపారం పాడైంది.

శా—అయ్యో, పాపం

సీ—నా ప్రియురాలి యజమానిట ఊర్నించి వచ్చాడు.

శా—ఎంత కర్మం వచ్చిందీ!

సీ—పైగా ప్రారబ్ధం, వాడి కిదంతా తెలిసిపోయింది.

శా—ఇంత త్వరగా ఎల్లా తెలిసిందయ్యా ?

నీ—ఏమో! వేళప్రకారం ఇందాకా వెళ్లేసరికి ఎవరో నా మొహం బద్దలయ్యేట్టు ఫెడీమని తలుపేశారు.

శా—నీ మొహం బద్దలయ్యేట్టు!

నీ—అవునండీ, నా మొహామే...

శా—తలుపు ఫెడీమని వెయ్యడం చాలా మోటుగా ఉంది.

నీ—నేను మాట్లాడదాం అనుకుంటే 'యజమాని వచ్చారు, ఫో' అన్నారు.

శా—పాపం తలుపు తియ్యనే లేదూ ?

నీ—లేదు, పైగా, ఆ అమ్మాయి కిటికీలోంచి, కోపంగా నామీద ఓ రాయి గిరవటేసిందండీ!

శా—(ఆశ్చర్యంతోలాగ) ఏమిటీ? రాయా?

నీ—మరేనండి, చిన్నరాయి కాదు, మంచి విలవైన రాయి. ఆవిడ నాకిచ్చిన స్వాగతం అది.

శా—ఔర వెఱ్ఱివాడా! నీ అవస్థ చూస్తే నాకు జాలేస్తోందే!

నీ—ఆ యజమాని రావడం నాకు విషమించిందండీ!

శా—నీకు లెఖ్ఖేమిటీ! ఏదో ఉపాయం చూడు.

నీ—వాడు ఘట్టి కాపలా పెట్టాడాండీ, దాన్ని మించి, పోయే ఎత్తు వెయ్యాలండీ!

శా—నీకు తిలణం. ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తోంది గా!

నీ—నిశ్చయంగా.

శా—అందుకనే నీ రొట్టె నేతిలో పడుతుంది.

నీ—అనుకుంటున్నాను.

శా—బెడ్డదెబ్బ లెఖ్ఖేమిటయ్యా, అదో ఛలోక్తి! అందులో ఆశ్చర్యం ఏముందీ!

నీ—నిజమేనండి, ఆ యజమానే అల్లా చెయించి ఉంటాను, అందులో ఆశ్చర్యమేమిటిగాని, నాకు ఆశ్చర్యం వేసిన విషయం మాత్రం మరోటి ఉంది.

శా—(కుతూహలం లేనట్టు యాదాలాభంగా) ఆ ఆశ్చర్య మేమిటయ్యోయ్!

నీ—ప్రేమ పెద్ద గురువుగావును, ప్రేమ క్షణంలో ప్రకృతి పరివర్తన తెస్తుందిగావును, ప్రేమ అద్భుతాలు జరుపుతుంది గావును, ప్రేమవల్ల లుబ్ధులు దాతలూ, భీరులు శూరులూ, అధములు ఉత్తములూ, ముగ్ధలు ప్రౌఢలూ అవుతారు గావును...

శా—గావును గావును గావును...ఏమిటిప్పుడూ!

నీ—ఆపిల్ల ఎంజేసిందా, కిటికీలోకి వచ్చి, నన్ను చూసి, "నువ్వు చెప్పేది నాకు తెలుసులే. ఇదుగో వుచ్చుగో నా సమాధానం" అనే మాటలు అంటూ ఒక రాయి గిర వటేసిందండీ. అది నా కాళ్ళదగ్గిర పడింది. ఆ రాతికి...ఓ ప్రేమజాబూ...కట్టేసిఉంది.

శా—(కళ్ళు తేలేసి) ఆఁ ఆఁ ఆఁ.

నీ—పరమాశ్చర్యం కాదండీ! ప్రేమ హృదయాన్ని మార్చదండీ! బుద్ధిని నిశితం చెయ్యదండీ! చెప్పండి ఏమం టారు! మీరు ఈ రాతిజాబు వ్యవహారం మెచ్చుకోరూ? ఆ యజమాని హాస్యస్ఫురుడు కాలేదూ? (అని నవ్వుతాడు)

శా—(బలవంతంగా నవ్వుతూ) ఆ. చాలా హాస్య స్ఫురుడైనాడు.

నీ—అబ్బ, ఇంతకంటె ఏముంటుంది బాఘా నవ్వండీ! ఆ అతిజాగ్రత యజమాని తన పద్ధతులవల్లే తను అమాయి కవు ట్రెయినింగిచ్చిన పిల్లచేతే దగాపడుతున్నాడు. ఇది ఒక ఘోరకమైన సారస్యం కాదండీ! తల్చుగుంటేనే నాకు నవ్వొ స్తోంది. మీరు బాగా నవ్వరేమండీ!

శా—క్షమించాలి నేనూ తెగనవ్వుతున్నాను. ఇదుగో. (అని పళ్ళన్నీ కనపరిచి ఆగి) చాలా? (అని హాస్ హాస్ అని నవ్వి ఆగి) సరా! (అని తలపెక్కించి హీహ్హీ అని ఆగుతాడు)

నీ—సరే. నా ఆంతర్యం మీకు గురుకుదురు కాబట్టి ఆ అమాయకవు ప్రేమలేఖ మీకు వినిపిస్తానుండండి. (అనిలేఖ పైకి తీస్తాడు)

శా—(తనలో) రాయడం నేరపద్దంటే మరంవాళ్ళు విన్నారు కారు. వెళ్ళి వాళ్ళని చంపాలి.

నీ—(ఉత్తరంచదువుతాడు) "రాయడంనాకు ఎవరూ నేర్పలేదు. నేనేనేర్చుకున్నాను. నాకు ఏమీ తెలియదు. ఇది

రాయడం తప్పో ఒప్పో ఎరగను. నా హృదయాన్ని విప్పిచెప్పే మాటలు నాకు లేవు. నిన్ను ద్వేషించాలిట! ఆపని నేను చేయలేను. నీలోనే నా జీవితం నాకు కనపడింది. యువకులు మోసగిస్తారట. కానినువ్వు మోసగాడవు కావు. నీమాటలు నిజము, నువ్వు నిజము. నీమాట నిజము కాకపోతే దుఃఖం మితిమీరి నేను మరణిస్తాను"

శా—అసి టక్కరిభడవా! (అనిదగ్గుతాను.)

నీ—ఏమిటంటున్నారు?

శా—నేనా, అబ్బే, ఏం లేదూ. ఊరికే దగ్గొస్తే దగ్గుతున్నాను.

నీ—చూశారా! ఇ తనిష్కల్మష మైన హృదయ ప్రకటన ఎక్కడేనా చూడగలంటండీ అసలూ! ఇటువంటి పవిత్రాత్మని అజ్ఞానాంధకారంలో పడేసి ఉంచడం తలవంపు కాదండీ? కాని, ప్రేమ ఉదయించి ఆ అంధకారాన్ని పటాపంచలు చెయ్యడం మొదలుపెట్టింది లెండి. ఏ దేవుడు దయవల్లో నేను నెగ్గి ఆయుజమూని పశువు, ఆ మోటజంతువు, ఆపరమ తుంటరి, ఆ రాతిరౌడీ, ఆ పూర్ణమూర్ఖుడు, ఆ నర మృగం...

శా—సెలవు సెలవు! వస్తాను.

నీ—అంత అత్రాతుగా పోతున్నారే!

శా—ఒక అర్జెంటు పని జ్ఞాపకం వచ్చింది, వెళ్ళాలి.

సీ—కొంచెం ఉండండి అబ్బా, నాకు సలహా చెప్పండి. ఆయింటికి వెళ్ళడం ఎల్లా? మొదట ఒక ముసిలిదాన్ని పంపించాను. అది నాలుగు రోజులకిందట చచ్చిపోయింది.

శా—అబ్బ! ఏదో ఉపాయం దాన్నే అడుక్కుందురూ (అనేసి తొందరగా కుడిఎదరనించి వెళ్ళిపోతాడు)

సీ—సెలవ్. ఏమీ తోచకపోతే, మీరున్నారుగా. మళ్ళీ మీదగ్గరికే వస్తాను. (అని ఎడమ ఎదరికి నిష్క్రమిస్తాడు)

---

## రంగం - 4

శానయ్య ఇల్లు.

శా—(కుడిఎదర్నించి వచ్చి కూచుని, కొంచెం ఆలోచించి, కుడిఎదర కేసే తిరిగి) ఏంరా! మాలోకం!

మా—చిత్తం. (అంటూ కుడిఎదర్నించి వస్తాడు)

శా—మరి అక్కడికి త్వరగా వెళ్లు. నేనింతకుముందే వెళ్ళొచ్చాను.

మా—ఇదిగో వెడతానండి.

శా—అక్కడ జాగర్తరోయ్.

మా—మీాకు చాదస్తంగాని, మళ్లీ చెప్పాలాండీ!

శా—మెత్తపడి వాడికిగాని ప్రవేశం ఇప్పించావా...

మా—ఛఛా. అల్లాంటిపని ఎప్పుడూ చెయ్యనండి.

శా—నా గౌరవం పోతుందిస్మీ.

మా—నాకు మాత్రం అగౌరవం కాదండీ! అల్లాంటి పనే, బుర్రపోవాలిగాని!

శా—తప్పుడు పని చేసి వాడికి సాయం చేశావా, నిన్ను జనం చంపేస్తారు. చంపేసీ, ఇదుగో ఆ వెధవా అంటారు.

మా—అంత బుద్ధిలేనివాణ్ణి కాను, బాబూ.

శా—అయితే, వాడే ఒకవేళ వస్తే, నువ్వేం జెయ్యాలో ఆ పాఠం జ్ఞాపకం ఉందా?

మా—ఓ. పిక్కలాగ జ్ఞాపకం ఉంది.

శా—ఏదీ ఓసారి అభినయించు చూద్దాం.

మా—మీారే ఆ అబ్బాయి అనుకుని రండి మరి!

శా—(లేచి కొంత సర్దుకుని దీనత్వం నటిస్తూ) మాలోకం! మాలోకమోయ్! మాలోకమూ! నాకు సాయం చేసి నా విచారం తగ్గించవోయ్, నన్ను లోపలికి రానీవోయ్!

మా—(నటిస్తూ—అసహ్యతతో) పోపో చవటా! (అని చెదరకుండా తీవిగా నుంచుంటాడు.)

శా—(నటిస్తూ) నువ్వు ఎంతో మంచివాడవురా అబ్బా!

మా—(నటిస్తూ, చెయి విసిరి) పోవోయ్ గాడిదా!

శా—(నటిస్తూ) నాకూ మానమర్యాదలున్నాయి, ఇందులో నీకేమీా చిక్కు రాదోయ్!

మా—(నటిస్తూ, మనిషిమీదికెళ్లి) నీకొక్కడూ చెబుతూంటా! చెప్పుచ్చుగు తన్నేను, పో!

శా—(నవ్వుతూ) బాగుంది, బాగుందిరోయ్, (నటిస్తూ) నీకు కనికరం లేకపోతే నా ప్రాణం దక్కదురా మాలోకం!

మా—అందుకనే ముందు మీ యింటికెళ్ళి మరీ చచ్చిపో!

శా—(మెచ్చుతూ) భేష్! (నటిస్తూ) నేను నీ శ్రమ అట్టేపెట్టుగోను. ముందే పుచ్చుగో పోనీ! ఇదిగో. (అని డబ్బు ఇస్తాడు) తరవాత చాలా ఇస్తాను.

మా—(నటిస్తూ - డబ్బుపుచ్చుగుని మనిషినితోస్తూ) పోతావా పోవురా?

శా—(నటిస్తూ—కదలడు.)

మా—(నటిస్తూ—లోపలి కఱ్ఱ తెచ్చి) వెళ్ళమంటే ఏమిట్రా నీ పైత్యం!

శా—ఆఁఆఁ ఆగు. చాలు.

మా—అయ్యగారూ! నేను బాగా అభినయించలేదండీ! నిజంచెప్పండి.

శా—చాలా బాగా ఉంది గాని, మరి డబ్బు పుచ్చుగో కూడదు. పుచ్చుగున్నావే!

మా—బస్ అదాండీ! అక్కడ ఒఖచోటామాత్రం మీరు చెప్పిన పాఠం మరిచిపోయానండి. అల్లాయితే పోనీ మళ్ళీచేద్దాం రండి.

శా—వద్దులే నువ్వెళ్ళిపో త్వరగా.

మా—చిత్తం. (అని ఎడమమధ్యకి పోతాడు)

శా—(కొంచెం నడుస్తూ) రిబ్బన్లూ పౌడర్లూ సెంట్లూ రుమాళ్లూ చీర్లూ నవరాలూ లాంటివి అమ్మేవాళ్ళు ఆ వీథికి వెడితే వాళ్లు ఒకవేళ వేషధార్లేమో కనిపెట్టడానికి జనాన్ని పెట్టాను. చూద్దాం సంగతి! (ఎడమ ఎదరకేసి చూసి) ఓహోహో! ఇదుగోవీడు మళ్ళీ తయారూ!

నీ—(ఎడను ఎదర్నుంచి వచ్చి) అయ్యా! నమస్కా-రం. (అని కంగారు పడతాడు.)

శా—చిత్తం. రండి. ఏ మల్లా కంగారుగా ఉన్నారు! ఏమైంది!

నీ—ఏం చెప్పను! చావు తప్పి కన్ను లొట్టోయింది! ఇవతల పడ్డాను.

శా—ఎక్కణ్ణించి?

నీ—ఆ అమ్మాయి గదిలోంచి. అని స్థాయిగా కూచుని చెమట తుడుచుగుంటాడు)

శా—ఎల్లా?...(తనలో) అయ్యో! గదిలోంచా? ఇహ బతకనే ప్రభా.

నీ—మేడమీంచి నాకు సంజ్ఞచేసింది. దిగి తోట తలుపు తీసింది.

శా—(ఆశ్చర్యంగా) అక్కడ జనం లేరు మరీ!

నీ—కంటపడేవాళ్ళు లేరు మరి. అక్కణ్ణించి నన్ను తన గదిలోకి తీసికెళ్ళింది. ఇంతలో పెద్ద దెయ్యంలాగ ఆ యజమాని అవిణ్ణి చూడొచ్చాడుట!

శా—ఆఁ.

నీ—చటుక్కున నన్ను డ్రెస్సులు పెట్టేచోట ఆ అమ్మాయి దాచేసింది.

శా—(మెచ్చుకుంటూన్నట్టు నటిస్తూ) ఆరి దీని తెలివి తగలెయ్యా!

నీ—ఆ యజమాని ఎందుకో ఇటూ అటూ పరుగులూ, బారెడేసి నిట్టూర్పులూ, బల్లలు పడదొయ్యడమూ, పక్కల్ని తన్నడమూ మొదలెట్టాడు. వాడూ పసికట్టి ఉంటాడు. చివరకి పోయాడు. నేనూ ఏర్పాటు చేసేసి వచ్చేశాను.

శా—ఏమి ఏర్పాటయ్యోవ్!

నీ—నేనాపిల్లని అక్కణ్ణించి తీసుకుపోతానండీ. మీరు తప్ప ఇక్కడ నాకు ముఖ్యులు లేరు, వినండి. రాత్రి పన్నెండింటికి వెళ్ళి సంజ్ఞగా మూడు సార్లు నకిలిస్తాను.

శా—నువ్వే!

నీ—మరే. ప్రభ కిటికీతీసి నిచ్చెన వేస్తుంది. నేను ఎక్కి లోపలికి వెడతాను. వెంటనే దిగివచ్చి (చిటికె వేసి, పోతాం అన్నట్టు కళ్ళమాతతో సూచిస్తాడు) ఇదీ ఎత్తు. నావిజయం మీవిజయంలానే భావించేవారు గనక, ఏం జరిగిందీ మళ్ళీ వచ్చి మీతో చెబుతాను. ప్రస్తుతం సెలవ్.

వెళ్ళి ఏర్పాట్లు చూసుగోవాలి. (అని లేచి, ఎడమ ఎదరకి పోతాడు)

శా—ఔర! నాచేత అపనిందలు పడకుండా ఇంత వరకు ఏభర్తా దాటలేదు. ఆ అవస్థే పెళ్ళికి పూర్వమే నాకు పట్టింది. కాని, నా అవస్థలో ఓ విశేషం ఉంది. ఏమిటంటే ఈ పడుచుకుంక తన గర్భశత్రువునైన నేనే తనకి ఆంతరంగికమిత్రుణ్ణి అనుకుంటున్నాడు. తన కార్యవిధానం యావత్తూ నాతో స్వయంగా చెబుతున్నాడు. నేనూ తయారై చూస్తాను. వీడు దాని మనస్సు లాగేశాడు. నేను దాని శరీరం ఆపేస్తాను.

[ ఎడమఎదరనించి సరయ్య వస్తాడు ]

స—(లోపల్నించి) ఏమండోయ్, శ్రీ అరుణాచలంగారు!

శా—(అటు చూసి) ఆఁ. రా, కూర్చో!

స—కనిపెట్టుగున్నావుగావును, భోజనానికి లేద్దామా?

శా—నే నీపూట ఉపోష్యం.

స—నన్ను భోజనానికి రమ్మన్నావ్, ఏమిటీ వికారం?

శా—క్షమించు, నేను కొంత ఆలోచన చేసుగోవాలి.

స—పోనీ, నీపెళ్ళి రేపేనా?

శా—నా పెళ్ళిగురించి నీకు బాధ ఎందుకు పోదూ!

స—ఊళ్ళోవాళ్ళ తప్పొందుపన్లన్నీ నువ్వు గ్రంథం చెయ్యలేదూ! అల్లానే.

శా—సరేలేస్తూ, నాదారి వేరు.

స—అల్లానా! పోనీ, పిల్లని చూపించు, చూపిస్తా నన్నావ్.

శా—అన్నాను అనడం, అంటేమాత్రం? ఇప్పుడు అభిప్రాయం మారింది.

స—నన్ను కూడా నమ్మవా?

శా—నమ్మకేంగాని, జాగ్రత్త ఎందుకేనా మంచిది.

స—నీ ధోరణి ఇల్లా మారిందే!

శా—వ్యక్తుల్నిబట్టి మారుతూంటుంది.

స—నేను పూర్వవ్యక్తి నేగా!

శా—వ్యక్తి పూర్వవ్యక్తి అయినా, కాలంమారదు మరి!

స—అంటే సంబంధం బెసికిపోయిందా?

శా—ఛస్తే బెసికిపోదు. నాచేతిలోది ఎక్కడికి పోతుందీ?

స—ఏమో, ఎవడు చెప్పగలడూ?...పోన్లే ఏమైతే నాకెందుకులే, నువ్వు ఆడారి భర్తవుమాత్రంకాకు.

శా—కాను. నేను ఎంత చెడ్డా ఆడారి భర్తకంటె పై చెయ్యిగానే ఉంటాను.

స—ఉండవు. ఒకేవిషయం ఎల్లప్పుడూ ఆలోచించే వాడు ఆవిషయంకంటె నీచుడే!

శా—కాదు, సత్యవాది.

స—అల్లానా! అయితే ఆ సత్యవాదికి క్షమ ఉం దద్దూ, పోనీ!

శా—సరిసరి, చంపేస్తున్నావే, ఎక్కడోగానీ! ఆకారి తనం పాపం. పాపాన్ని నేను ఏకుతాను.

స—నాఅభిప్రాయం వేరు...నువ్వు ఆలోచించుగో పాపం. నేపోతాను అరుణాచలం! (అని ఎడమ ఎదరికి పోతాడు)

శా—(ఎడమఎదరికి చూస్తూ) ఎరక్కపోయి రమ్మ న్నానువీణ్ణి! ఇటువంటి విషయాలు తెలియని వాళ్ళతోతప్ప వాదించకూడదు!

మా—(ఎడమ మధ్యవించి వచ్చి) అయ్యగారూ! పురోహితుడు వచ్చాడండీ!

శా—రేపు కనపడమను. చెప్పిరా.

మా—చిత్తం. (అని ఎడమమధ్యకి వెళ్ళి అప్పుడే వస్తాడు)

శా—ఒరేయ్! ఇల్లారా! (అని రహస్యంగా) ఈ వేళ రాత్రీ, వాడొచ్చి, నిచ్చెనమీాదా, చంద్రప్రభనీ లేవ దీసుకు పోతాట్ట! (అభినయిస్తూ) లావాటి కర్రతో, వాణ్ణీ, పైచివర మెట్టుమీాది కెక్కేసరికీ నువ్వూ, ఏకాలి!

మా—ఓ. వాణ్ణి చావగొట్టేస్తాను. చూద్దురుగాని, ఆ బడితెబాజా!

శా—బడితపూజా ఎక్కడ చేస్తావ్ ?

మా—ఎక్కడేమిటండీ, వాడి బుర్రమీదే !

శా—వద్దువద్దు. బడితబాజాకి పీపీ మంచి రంగం, ఇంకా ఆలోచిద్దాం, రా. (అని ఇద్దరూ కుడిఎడరికి పోతారు.)

---

## రంగం—5

శానయ్యఇల్లు : కుడిఎడర కేసి రెండు
కుర్చీ లుంటాయి

శా—(తొందరగా ఎడమ ఎడరనించి వస్తూ తన వెనకాలేవ వస్తూన్న మాలోకం కేసి తిరిగి) హోరి! నా ప్రాణం మీదికి తెచ్చావురా, రాలుగాయి చచ్చినాడా! వాణ్ణి బుర్రమీద కొట్టకురా అంటే, వాడి బుర్ర బద్దలుకొట్టి వాణ్ణి చంపేశావుగదా !

మా—(భయంతో) నే నేం జేశానండీ, మీరు చెప్పినట్టే కొట్టానూ!

శా—నీ శ్రార్ధం! వాడి బుర్ర పచ్చడిచేశావు. వాడు మాటలేకుండా గతించి ఊరుకున్నాడు. ఇప్పుడు నా కేమిటి దారి! నన్ను పట్టుగుంటారు. (పళ్ళు బిగించి) బుర్రమీద కాదురా కొట్టడమూ (వాడి వీపుమీద కొడుతూ) వీపు మీదరా (మళ్ళీ కొడుతూ) వీపుమీద రా అని (మళ్ళీ

కొడుతూ) హెన్నిసార్లు చెప్పానూ! (ఆగి) బుర్రతక్కువ్యం పీనుగ!

మా—(కొంచెం ఏడుస్తూ) నేను వాడి వీపుమీా తే నండీ కొడతా, వాడు బుర్ర కాశాడు గావు నూ!

శా—మరి నోరు ముయ్! తెల్లారొస్తోంది. నువ్వు ఆ మేడదగ్గిరే ఉండు. నాపని ఆఖరే ఇహాను. వెళ్ళు.ఆ కర్ర ఇక్కడ తగలేసి మరీ వెళ్ళు.

మా—(కర్ర కుడిఎదర పడేసి వచ్చి, ఎడమ ఎదరకి పోతాడు)

శా—(కూచుని) ఔర! కసి ఎల్లా పరిణమించిందీ! వాళ్ళ నాన్నకూడా వస్తాడుగావును. అకస్మాత్తుగా ఈ వార్త వింటే అతడేమవుతాడో! నా కేం రాసిందో!

(పడినప్పుడు ఒకటిరెండుచోట్ల ఒళ్ళు కొట్టుకుపోగా కట్టిన కట్లతో మెల్లిగా ఎడమమూలనించి నీహారం వస్తాడు)

నీ—(వస్తూ) ఏమండోయ్!

శా—ఎవరదీ! (అని లేస్తాడు)

నీ—నేను నీహారాన్ని. మీాకోసమే, మీారింత పెందరాళే లేచారే!

శా—(తనలో) ఇదేమిటి దైవమా! వీ డెల్లా బతికాడో! కలా, యక్షిణీఆ? (పైకి) రా. కూచో కూచో.

నీ—కొంచెం బాధగా ఉందండీ. నాయత్నం అంతా సర్వ భగ్నం అయిపోయి...

శా—అలానా పాపం!

నీ—...నట్టు కనిపించి, చివరకి ఛట్టున నెగ్గిందండీ!

శా—( నవ్వుమొహం పోయి ) హారి నీఅదృష్టం కాలా! అల్లా ఎల్లా జరిగిందీ?

నీ—నామెత్తు నాశత్రువుకి ఎల్లానో తెలిసిందిగావును, నన్నుకొట్టడానికి జనాన్ని పెట్టాడు. నిచ్చెన ఉంది. నేను పైకంటూ ఎక్కేసరికి అమాంతంగా కర్రలు లేచాయి. నాకు తారెత్తి కాళ్లారి కిందడ్డాను. ఒళ్లుకొంచెం కొట్టుకుపోతేంగాదండి, నిచ్చెనకి తగిలాయి గాని నాకు ఒక్కకర్రదెబ్బ తగల్లేదు. నేను కిందడి మరి లేవలేదు.

శా—చిత్రంగాఉందే!

నీ—కర్రదెబ్బలవల్లే నేను గతించానని వాళ్ళు గుస గుసలు మొదలెట్టారు. ఆ చీకట్లోనే వచ్చి నన్ను చూశారు. నేను శవంపాత్ర అభినయించాను.

శా—సరి, అంతేగాని నువ్వు చచ్చిపోలేదూ?

నీ—అనుకున్నానుగాని, మానేశాను.

శా—ఏం?

నీ—నీమూలాన్నే అంటే నీమూలాన్నే అనుకుంటూ అంతా పోయారు. కాపలావాళ్ళు అంతకిముందే జారిపోయారు. నేను చచ్చేయ్యనా, లేక లేచివచ్చేయ్యనా అనుకుంటూంటే ఓ చిత్రం జరిగింది.

శా—ఏమిటా చిత్రం?

నీ—కొట్టడాని కొచ్చినవాళ్ళ గుసగుసలు విని, నే పోయాననుకొని, నే పడ్డచోటికి చంద్రప్రభ వచ్చింది. నే పోలేదని గ్రహించి ఆనందించింది. ఇకమరి అక్కడ ఉండక పోడం నిశ్చయించుగుని నాతో వచ్చేసింది తీసుగొచ్చాను.

శా—( చిరునవ్వుతో ) చాలా బాగా చేశావ్. ఇప్పు డెక్కడుంది, పాపం!

నీ—( ఎడమమూల చూపించి ఇక్కడే అవతల నుంచోమని నేను లోపలికి వచ్చాను. మీవల్ల ఓసాయం కావాలి.

శా—ఏం సాయం?

నీ—ఆ అమ్మాయి లేచిరావడం అల్లరి సద్దణిగే దాకా ఆవిణ్ణి మీయింట్లో ఉంచాలి క్షేమంగా.

శా—నిన్ను గురించి నేనుకూడా అల్లరిపడనా! పోనీ, అల్లానే. తీసుగురా, నీకు ఉపకారం అవుతూంటే వద్దనడం ఎందుకూ?

నీ—అమ్మయ్య! తీసుగురానాండి!

శా—తక్షణం. నేను మాట అన్నానంటే, మరి తిరిగి పోడం ఆనమాయితు లేదు.

నీ—చిత్తం. ( అని ఎడమమూలకి పరిగెడతాడు )

శా—ఔర! అదృష్టానికి కళాకళలు. అదృష్టం ఈమాత్రమేనా కలిసొస్తూంటే చెప్పద్దు.

[ అని మొహామూ చేతులూ కప్పుగుని మధ్య ఎదర కుడికి తిరిగి నుంచుంటాడు. ఎడమ ఎదరనించి ప్రభవచ్చి,

ఎడమకి తిరుగుతుంది. వెనకాల సీతారం వస్తాడు. అక్కడే ఆగి ప్రభ సీతారంతో మాట్లాడుతుంది]

చం—నువ్వు వెళ్లిపోతావా?

సీ—ప్రభా! ఇప్పుడు నువ్వు నాతో ఉంటే మనకి చిక్కు. ఆయనతో వెళ్ళు.

శా—(జరిగి, ఎడమకి తిరిగిఉన్న ప్రభయొక్క కుడి చెయ్యి పట్టుగుంటాడు)

చం—(కుడికి తిరక్కుండానే) త్వరగా రామరీ!

సీ—రాకుండా ఉండగలనా!

శా—(ప్రభ చెయ్యి లాగుతాడు)

చం—(అటు తిరక్కుండానే) ఉండు. అల్లా లాగేస్తావేం! (సీతారంతో) నేను వెళ్ళడం ఎవరో ఎరగని మనిషితోనా?

సీ—భయం లేదు. ఆయన నా తండ్రిలాంటివాడు. నే పోతాను. వెళ్ళండి. (అని ఎడమఎదరకి పోతాడు)

శా—(ప్రభని కుడివేపుకి రెండంగలు నడిపించి, ఆగి) క్షేమంగా ఉండేచోటికి రా! (ముసుగుతీసేసి) నన్నెరుగుదువా?

చం—అయ్యో! మీరా? (అని ఎడమఎదరకేసి చూస్తుంది)

శా—ఓసి స్వామిద్రోహురాలా! మొహం చెల్లకనా అటుచూస్తున్నావ్?...ఎంత అమాయికత్వం నటించావ్!

..."ఆఅమ్మాయిని ఎక్కడేనా చెయించారో లేకపోతే చెక్కించారో కనుక్కోండీ" అని అడగడమూనూ (చెయ్యి ఇటూ అటూ విసివికరలా తిప్పుతూ) ఉత్తరాలూ లేచిపోడాలూనా! ఏ శక్తి నేర్పిందే నీ కీవిద్యలూ! ఏమి ధైర్యం, ఏమి తెగింపు! ఎంత అవిశ్వాసం, ఎంత కృతఘ్నత! పాలోసి పాముని పెంచానే!

చం—మీా రల్లా కోప్పడతా రెందుకూ?

శా—అవునవును. కోప్పడక మరి ముద్దెట్టుగోమన్నావా?

చం—నేను మీా కేమీా హాని చెయ్యలేదే!

శా—నువ్వు నాతో ఉన్నట్టే ఉండి, కుట్రకుంకతో లేచి పోడం నాకు హాని కాదూ?

చం—అతడు నన్ను తన భార్యగా ఉండమన్నాడు. మీారు చెప్పినప్రకారం, దోషం పోవడం నిమిత్తం, పెళ్ళికి ఒప్పుగున్నాను.

శా—సరిసరి. పెళ్ళంటే నాతో పెళ్ళి అని నీతో స్పష్టంగా చెప్పానుగా!

చం—కాని, మన్లోమాట! నాకు భర్తగా అతడుండడం నాకిష్టంగాని మీారుండడం కాదు.

శా—ఏం, నేనేమన్నా (మీాదికెళ్లి చేతులూగిస్తూ) నీ నెత్తిమీాద రాయెత్తానా, బాదు దింపాడా?

చం—మీారు పెళ్ళంటే చిక్కు, బాధా, దెయ్యం అన్నారు. అతడు పెళ్ళంటే సౌఖ్యం అనిపించేటట్టు ఉన్నాడు.

శా—(అసూయతో) ఏడిశాడు, సుంకాత్మీగాడు! అయితే, వాడంటే నీకు ప్రేమగావును పాపం.

చం—అవును. అందులో తప్పేముందీ?

శా—ఆసంగతి నాతో చెప్పడానికి నీకు గుండెల్లా వచ్చిందీ అని.

చం—సత్యం అయినప్పుడు ఎందుకు చెప్పకూడదూ అని.

శా—ఓసి భ్రష్టా! నువ్వల్లా తప్పుడు ప్రేమ ప్రేమించచ్చుటే మరీ!

చం— ఎందుకు కూడదూ! అతణ్ని చూసింతరవాత గాని, నాకు ఆ ధోరణే లేదు. ఆమాటే తెలియదు.

శా—అయినా సరే, నీకోరిక తప్పు.

చం—సంతోషం ఇచ్చే కోరిక తప్పు అనేవారెవరూ?

శా—(చికాకుగా) నీ సంతోషం సంతకెళ్ళా, నా కది కోప కారణం కాదుటే మరీ. చంపేస్తున్నా వెక్కడో గానీ.

చం—మధ్య మీ కెందుకూ కోపం!

శా—అరే! మీకు కోపం ఎందుకంటా వేమిటే! మరి ఈ విషయంలో నాకు కోపం లేకపోతే ఇహా నెవడి కుంటుందే వట్లో వాడికీ!... సరేగాని ఒక సంగతి చెప్పు. నీకు నామీద కోరికే లేదా?

చం—మీమీదేనా?

శా—అవును.

చం—ఏం జెయ్యనూ,...లేదు.

శా—చీమంతైనా లేదూ ?

చం—చీమ కాలంతైనా లేదు. అబద్ధం ఆడమన్నారా!

శా—ఓసి తుంటరి పొగరుబోతమ్మా! (నొక్కి-నొక్కి మాట్లాడుతూ) ఎందుకు లేదే నీకు ప్రేమనామీాదా ?

చం—బాగుందండోయ్. అది నేనెల్లా చెప్పనూ! నేను మిమ్మల్ని ప్రేమించే ధోరణి మీాలో లేదు. మీారు కూడా అల్లాంటి ధోరణి కనపరచకపోయారా! ఎవరొద్దన్నారూ!

శా—అల్లాంటి ధోరణి కనపరచడానికే కాస్టే, ఇన్నేళ్ళనించీ నిన్ను గురించి నాశ్రమా!

చం—అయితే ఈవిషయంలో అతడే ఎక్కువ తెలిసినవాడు. అతడు ఏశ్రమా లేకుండానే ప్రేమించాడు.

శా—(తనలో) ఓరి దీని సమాధానాలు తగలెయ్యాయ్! ఆఁ, నన్ను రకాయించేస్తోంది. అమాయిక స్త్రీ కుడా ఈ విషయంలో అఖండ పండితుడికంటే ఎక్కువ వాదిస్తుంది గావును. (పైకి) అయితే ఓసి వాదమ్మా! ఇంతకాలం నేను నిన్ను పెంచి సొమ్ము వెచ్చించుతా, వాడికోసమా ?

చం—సొమ్మా! అతి డిచ్చేస్తాడు అణాపైసల్తో.

శా—( తనలో ) హారి! చూశారా, చూశారా! ఎల్లా చెప్పెయ్యగలదో! ( పైకి ) సొమ్ము కాక ఇంకా బోలెడు

న్నాయి నే నీ్నకిచ్చినవి. (పళ్ళు బిగించి తక్కుతూ) అ వెల్లానే టక్కుల టికూ్కా!

చం—అవన్నీ కలిపి మీా రనుకున్న విలవఉండవ్.

శా—బాల్యంనించి నీకు ఇప్పించిన ట్రైనింగు!

చం—అవును, అజ్ఞానంలో! ఎల్లకాలమూా అల్లా ఉండిపోనా!

శా—ఉండకు. వాడితో లేచిపోయి విద్యలునేర్చుగో!

చం—తప్పకుండా. ఇ.తవరకు నేర్పిం దతడే. అతడికే నే నెక్కువ ఋణంఉన్నాను, మీాకుకంటె.

శా—ఇల్లాంటి పెడసరపు సమాధానాలకి నిన్ను ఊడిస్తే ఎవరు నీకు దిక్కూ?

చం—ఆ ప్రజ్ఞకూడా చూపెట్టండి.

శా—(కళ్ళు మూసుగుని కుడిచేత్తో తన నుదురు పట్టుగుని ఒక లిప్త ఆలోచన నటించి) ప్రభా! ఇంతవరకు అయిన దేదో అయింది. గతానికి నిన్ను క్షమించాను. అదంతా జరగనట్టే. ఇక నన్ను ప్రేమించు. (చిరునవ్వుతో) నాక్షమనిబట్టి నాప్రేమవై శాల్యం కొల్చుగో! నేను సంతోషంగా ఉండడం నీకిష్టంలేదూ?

చం—ఎంతమాటా! మీాకూ సంతోషం కలగ వలిసింతే అని కోరతాను.

శా—అయితే,(నిట్టూర్పువిడిచి) నానిట్టూర్పుచూడు,

నా దీనత్వాం గమనించు. ఆ మంత్రిగాణ్ణినూని, నాతో ఉండు. నిన్ను ఆదరించడమే కాదు శిరసావహిస్తాను. నాప్రేమకి దాఖలా ఏం కావాలో చెప్పు. ఏడవమంటే ఏడుస్తాను. మొత్తు కోమంటే మొత్తుగుంటాను. జుట్టు పీక్కోమంటే తల కోడి గుడ్డులాగ చేసేసుగుంటాను. చావమంటే నవ్వుతూ పోడుచుగుంటాను. నీ మీాద అదీ నాప్రేమ.

చం—ఆగండాగండి. మీా ఉపన్యాసం నా హృదయాన్ని స్పృశించనేనా లేదు. నీహారం ఒక్క మాటతో నా హృదయాన్ని పెళ్లిమంత్రాలు వెయించాడు.

శా—సరే, మరి చాలు. నను. ఆకోట్లోకినను. (అని కుడి మధ్యకి చూపిస్తాడు) నిన్ను మరో దేశంలో ఉండే మతానికి పంపేస్తాను.

చం—దిక్కులు చూడకుండా తిన్నగా కుడిమధ్యకి వెళుతుంది)

మా—(గబగబా ఎడమఎడరనించి వచ్చి) అయ్యగారూ! ఆ చంద్రప్రభా ఆ శవమూా లేచి పోయారండీ!

శా—ఖంగారుపడకు. ప్రభ ఇక్కడుంది లే. నువ్వెళ్లి శకటం తయారు చెయించు. ప్రభని పంపించేద్దాం.

మా—(ఎడమ ఎడంకి వెడుతూ) చిత్రం!

నీ—(ఎడమ మధ్యనించి దిగాలుపడి నడుస్తూవచ్చి) విన్నారా, శానయ్యగారూ!

శా—ఏం ఏం! ఏం జరిగింది!

సీ—నా కష్టం అంతా నేలపాలైంది. మా నాన్న వచ్చాడు.

శా—ఎరీ, ఆయ నెక్కడున్నారూ?

సీ—ఇల్లానే వస్తారు. ఉండండి, నా మాట వినండి, ఇక్కడికి ఏదో ముఖ్యమైన పనిమీాద వస్తారని రాశా రన్నానే, అదేమిటో తెలుసా?

శా—ఏమిటి?

సీ—నాకు ఆయన ఒక సంబంధం కుదిర్చాడట. తన స్నేహితుడైన సంతోషంగారి కూతురేట ఆపిల్ల. వాడూ వచ్చాడు.

శా—నన్నేం జెయ్యమంటావ్, అందుకని!

సీ—ఆ సంబంధం నాకు తప్పిపోయేటట్టు చెయ్యాలి, మీారు, మా నాన్నతో చెప్పి!

శా—అంతేనా?

సీ—అంతే.

శా—అయితే నిమిషం.

సీ—ఈ చంద్రప్రభ విషయం . మా నాన్నదగ్గిర రానియ్యకండి.

శా—అల్లానే.

సీ—(ఎడమవైపుకి చూసి) వాళ్లొస్తున్నట్టున్నారు. ఇల్లారండి, మా నాన్నని లొంగదీసే ఉపాయం చెబుతాను.

(కుడివైపుకి శానయ్యా, సీతారమా వెడతారు)

స—(ఎడమ ఎదరనించి వచ్చి తన వెనకాలవస్తూన్న కాటయ్య, సంతోషంగార్లతో) ఇదేనండీ, వారిల్లూ.

శా—ఇదే. మరే. జ్ఞాపకం వచ్చింది. సరే! సంతోషంగారూ! ఈ సరయ్య మీ బావమరిదని ఎవరు చెప్పారూ?

స—ఎవరూ చెప్పలేదు. నా భార్యకీ ఇతనికీ ఉన్న మొహం పోలికవల్ల నేనే పోల్చుగున్నాను.

స—పోల్చి వెంటనే మా సోదరి మరణవార్త చెప్పారు.

సం—అది భరించితీరవలసిందేగదా! శాస్త్రీ, దైవకృపవల్ల ఒక్క కూతురు ఉన్నది. ఆ పిల్లనే వీరి అబ్బాయికియ్యనిశ్చయించింది.

స—మీకు కూతురా! నాకు తెలియదే!

సం—(కాటయ్యని ఉద్దేశించి) వారుచెబుతారు.

[ కుడిఎదరనించి శానయ్యా, సీతారమూ వస్తారు ]

శా—(కాటయ్యతో) ఇదుగో కాటయ్య గారూ! క్షేమమా?

కా—చిత్తం.

శా—రండి. ఎంతసేపైంది వచ్చి?

కా—ఇప్పుడిప్పుడే.

శా—మనం కలిసి కొంతకాలం అయింది.

కా—మరే. మేం ఇక్కడికొచ్చిన పని ఏమిటంటే!

శా—తెలుసు తెలుసు

కా—అల్లానా! అయితే మరీ మంచిదీ. చిక్కేలేదూ.

శా—చిక్కూ! కొంచెం ఉంది. మీవాడు ఈవరకే ఓపిల్లని స్వయంగా ఎన్నుకున్నాడుట. మీరు తెచ్చిన సంబంధం

అతనికిఅనవసరంట. కాని, నన్నడిగితే. మీరు కుదిర్చిన పిల్లనే ఆతనికి ముడెట్టి, అతనిరోగం వెంట్రాళే కుదర్చండి.

నీ—(తనలో) ఓరి ద్రోహీ!

స—ఫలానాసంబంధం నాకొద్దు మొర్రో అనే వాళ్ళకి ఆ సంబంధమే రుద్దడం అధర్మం.

శా—ఒస్! తండ్రిమాట కొడుకు పాటించకపోడం అంతకంటె అధర్మం.

శా—అంతవర కెందుకు ఆగండి. మాకుర్రాడు నా మ్మాట వినడంప్రాచీ నాది!

శా—అల్లా అన్నారు, బాగుంది.

శా.—మీరన్న ప్రకారమే చేస్తామండి, శానయ్యా గారూ!

స—శానయ్యగారు కాదండి, అరుణాచలంగారనాలి ఇప్పుడు.

శా—పోనీ, అల్లానే అందాం.

నీ—ఓరి బాబో, శానయ్యగారే అరుణాచలంగారా! చాలా నాటకం అయిందే!

శా—(సీహారం కేసి) అదిరా అబ్బాయి రహస్యం! (తీవ్రంగా) మరి చూడు నాప్రభ. ఏమండోయ్! మీవాడి పెళ్లి తక్షణం చేసెయ్యండి.

శా—మేం కోరేదీ అదే! మీదే తరవాయి.

శా—(తోచక) నాతరవాయేమిటి!

శా—పెళ్ళి కూతుర్ని పిలిపించండి.

శా—అదేమిటీ?

శా—మేం ఇక్కడికొచ్చిన పని మీరు ఎరుగుదుం అన్నారే!

శా—(ఆశ్చర్యంతో) ఏమిటి ఎరుగుండడం!

శా—వినండి. ఈ సంతోషంగారికి సరయ్యా సోదరి వల్ల గాంధర్వంలో ఓ పిల్ల పుట్టింది. ఆ పిల్ల మీదగ్గిరుంది.

శా—(తెల్లపోయి) నాదగ్గిరా!

శా—అవును.

స—ఆశ్చర్యంగా ఉందే!

శా—మొదట ఆపిల్లని రహస్యంగా ఓ పల్లెటూరి అమ్మికి ఇచ్చేశారు. తరవాత వీరూ, భార్యా విదేశంలో ఉద్యోగానికి వెళ్లారు. అక్కడ వీరి భార్య గతించింది. వీరిటీవల వచ్చేశారు. పిల్లని గురించి ఆ అమ్మిని కనుక్కుంటే మీరు కొనుక్కున్నారని చెప్పింది.

స—అమాయికపు చంద్రప్రభ నా మేనగోడలా! సంతోషమే.

శా—ఆ అమ్మినికూడా ఖర్చిచ్చి ఈయన రప్పించారు. కావలిస్తే వచ్చి ఋజువు ఇస్తుంది.

శా—(నిశ్చేష్టు డవుతాడు)

స—శానయ్యా! నీబాధ నాకు తెలుసు. కాని, నువ్వు ఆడారి భర్తవు అవడం తప్పిపోయింది. ఈదెబ్బతో నువ్వు పెళ్ళే మానేసెయ్.

శా—(తన ఆశయాలన్నీ అకస్మాత్తుగా అడుగంటి పోడంవల్ల విచారం ఆపుగోలేక, కుప్పిళ్లు పట్టి, ఒక చెయ్యి విడిచి ఒక చేత్తో కళ్ళు కప్పెట్టుగుంటూ, తల ఆడించుతూ, ఇటూ అటూ తూలుతూ, పక్క చెక్కలకి కొట్టుగుంటూ ఎడమ ఎదరకి నిష్క్రమిస్తాడు)

నీ—(కుడిమధ్యకి తిరిగి) చంద్రప్రభా! (అని కేకేసి అటువెళ్ళి చంద్రప్రభని తీసుగొచ్చి, సంతోషంగారితో) ఇమగోనండి మీా అమ్మాయి!

సం—(ప్రభతో) అమ్మా! రా

చం—నాయనా, నమస్కారం.

స—శాన్యయ్యగారి కృషికి బహుమతీఇయ్యాలి.

నీ—బహుమతీమాట దేవుడికి తెలును, ఆయన దగ్గిర నేను బదులుపుచ్చుగున్న వందా తీర్చాలి ముందు.

స—అంతకంటె ముందు అన్నీ మన మేలు కోసమే. చేస్తూండే దేవుణ్ణి ఆరాధించాలి!

(కాటయ్య చంద్రప్రభ చెయ్యా, సంతోషం నీహారం చెయ్యా పట్టుగుని కలుపుతూండగా, ఎడమఎదరనించి ఈలా, చిటిగెలూ వేసి ఆడుతూ మాలోకం వెనకాలే వెడుతూండగా తెరపడుతుంది)

---

# పూర్వరంగం



[ ఈ ఆట ఆల్ ఇండియా రేడియో మెడ్రాస్ కేంద్రంనించి 5-6-1945 తేదీని మొదటి పర్యాయం ప్రసరింపబడింది ]

పాత్రలు

| | | |
|---|---|---|
| శానయ్య. | — | తండ్రి |
| సరళ | — | కూతురు |
| మాలోకం | — | నౌఖరు |
| సువర్ణం | — | వరుడు |
| ధన్, మన్ | — | నాటు డాక్టర్లు |

[ ప్రసారకులు భమిడిపాటి కామేశ్వరరావు, కె. సరోజిని, దుగ్గిరాల సత్యనారాయణరావు, జోశ్యుల సత్యనారాయణ, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు, వై. ప్రసాద్ ]

## రంగం-1

[ శాస్త్రయ్య ఇంటి వీధిగది — చిన్నబల్లా కొన్ని కుర్చీలూ — LF నించి శాస్త్రయ్య వచ్చి పచారు చేస్తాడు ]

శా—అబ్బ! ఏదో ఓటి ఏదో ఓటి వస్తూనే ఉంటుంది. చిత్తక్షోభ! బతిగున్న ప్రతీవాడూ చచ్చేదాకా బతిగి తీరాలి, దిక్కుమాలి చెర!! సరి, బతగాలంటే భుక్తి, ఆ భుక్తి కోసం డబ్బూ, ఆ డబ్బుగురించి నౌఖరీ తప్పవు గదా! పొట్టకూటికి నౌఖరీ తప్పనప్పుడు వ్యక్తి అందులో కూరుకు పోవలిసిందేగాని, ఇవతలకి రావడానికి వీలుండదు. ఇక, నా నౌఖరీ వంటిదాల్లో చావడానికి కుడా సెలవు, ముందుగానే మంజూరు కావాలి. ఇహ, నా కుటుంబానికి చెందిన విడి వ్యక్తుల్ని గురించి నేను యథావిధిగా ఆలోచన చెయ్యడానికి నాకు తీరుబడి ఎక్కడేదుస్తుంది! అబ్బబ్బ తండ్రికి వచ్చిపడే విషమసంసమస్యలలో కల్లా గడ్డురకం, కూతుళ్ళని గురించిన సమస్యలు. మా సరళ మాకు ఒక్కగాని ఒక్కపిల్ల! నేను తండ్రినిగనక చెబితే బడాయనుకుంటారేమో అని చెబుతూండను గాని, – విద్యావినయాల్లో, అందచందాల్లో, మా సరళని చెప్పి మరోర్ని చెప్పాలి. మా చిన్న సరళ ప్రతి నిత్యమూ కలకలలాడుతూండే మహా లక్ష్మి! అలాంటి రత్నంలాంటి పిల్లకి అకాత్తుగా తగసిను స్త్రీ పట్టుకుంది. ఆ మస్తీ పయినం అది చెప్పదు, ఇవతలవాళ్ళకి

తోచదు. ఏమే కూతురా అని అడిగితే, పరధ్యానంగా ముక్కడం, ఊఁహూఁ ఊఁ అనడం, బారిడేసి నిట్టూర్పులు విడవడం! ఈ సుస్తీయూవత్తూ పెళ్ళిసుస్తీ అంటుంది మా ఆవిడ! మా ఆవిడకి ఏం తెలుసూ, ఆడదీ! అయినా సరే ఆవిడ, పిల్లని గురించి నాతో ఏక వితండ వాదం! ఈసుస్తీ తగ్గితేగాని పెళ్ళిమాట ఇంటో స్మరించద్దని నేను శాసించే శాను. పిల్లకి ఇంకా పద్దెనిమిదేళ్ళైనా వొచ్చాయో లేదో అప్పుడే పెళ్ళేమిటి పొమ్మని మా ఆవిణ్ణి గట్టిగా మందలించి కసి రేశాను. కల్యాణం రావద్దూ! కల్యాణం వస్తే పెళ్ళి ఆగనూ ఆగదు. ఈ లోపున కానూ కాదు! కాని, పిల్ల పెళ్ళివిష యంలో తనకీ హక్కుందని మొదలెట్టి మా ఆవిడ మరి నాలుగు ఆకులు ఎక్కువ చదివి, మూడుసార్లు నెత్తి బాదు కుని రెండుసార్లు నూతులో పడుతున్నానని బెదిరించి, ఒక్క సారి పుట్టింటికి తుర్రుమంది. ఎందుకుటా! పుట్టింటారి తాలూకు ఓ మంచి గొప్ప సంబంధం ఉందిటా, వాళ్ళకి అంతా డబ్బేటా, పిల్లాజెల్లా ఉన్నా సరే వాళ్ళు మా పిల్ల దాన్ని తమ ఇంటో పడేసుకుంటారేమో అడుగుతుందిట! నేను కుడా అల్లాంటి మూర్ఖత్వంలో పడక, పెళ్ళిమాట దేవు డికి తెలుసును, ప్రస్తుతం పిల్లదానికి వచ్చిన సుస్తీ ఏమిటా, ఎల్లా కుదురుతుందా, అని వాకబు చేస్తూనే ఉన్నాను. బంధు వుల్నీ స్నేహితుల్నీ ఎందర్నో అడిగి చూస్తూన్నాను. తెమ లటంలేదు. నిట్టూర్పుతో) కానీ, చిక్కులు పడాలి. ఎం జెయ్యనూ!...ఒరేయ్, మాలోకం!

మా—అయ్యో (అంటూ L M నించి వచ్చి) చిత్తం!

శా—ఏం చేస్తున్నావ్ ?

మా—దొడ్లో పువ్వులుకోస్తున్నానండి. ఏమండీ?

శా—ఏమీ లేదు. ఎవరో వచ్చి వెళ్ళారు. వీధి గేటు తలుపు వేసిరా. (అని R M కేసి చూపిస్తాడు)

మా—చిత్తం. ఇందాకానే వేశానండి.

శా—ఓరి, అసాధ్యుడవే! వెళ్ళినవార్ని చూశావా?

మా—చిత్తం మీ అన్నగారి అమ్మాయండి. సరే గానండి అయ్యగారూ! రెండుమూడు రోజుల్నించి తమదగ్గిరికి చాలామంది వస్తున్నారు, వీరంతా బాకీలకోసమేనాండీ!

శా—కాదు కాదు. వేరే ఒక ముఖ్యమైన పని మీద.

మా—అయితే నాకు తెలుసునండి.

శా—ఏడిశావ్. తెలిస్తే చెప్పు మరీ.

మా—ఏముందండీ! అమ్మాయిగారిని గురించి మీరు వారిని సలహా అడుగుతూ ఉండి ఉండాలి.

శా—ఓరి పీనుగా, నిజమే. నీకెల్లా తెలిసిందిరా!

మా—నిజం చెప్పనాండీ!

శా—చెప్పూ!

మా—మీ మొహం కేసి చూడ్డంతో టే తెలుస్తోందండి. పైగా మీరు ఒక్కరూ కూచుని అమ్మాయిగార్ని గురించి పైకిమాట్లాడు కుంటూంటారుగా!

శా—నీ మొహాం ఈడ్చా, నిజమేరా, ఇట్టేకనిపె ట్టావ్. సలహాలు ఇవ్వడానికొచ్చిన వాళ్ళల్లోనూ...మా మేన గోడలు ఒకర్తె. మా మేనగోడల్ని అడిగితే ఏముందా...

మా—మీ మేనగోడలంటే బజారుపక్క వీధి డాబాలో ఆవిడేనాండీ?

శా—అవును.

మా—అయితే ఆవిడేమందో నే చెప్పేస్తానండి. అమ్మాయిగారికి వజ్రాలూ రత్నాలూ కొని పెడితే ఈవ్యాధి పోతుంది అని చెప్పి ఉండాలి.

శా—(కులుకుతూ) ఓరి నీజోస్యం మండా, రైటేరా! నువ్వు ఇది ఎల్లా చెప్పగలిగావ్?

మా—ఆవిడ భర్త వజ్రాల వ్యాపారం చేస్తాడు. ఆ సలహా మీరు వింటే వాళ్ళకి లాభం.

శా—అవున్రోయ్, నాకుతోచలేదు. నాస్నేహితు డొక డొచ్చాడు, ఆయనంటాడూ, ఈ వ్యాధి తగ్గిపోవా లంటే మంచి మంచి బొమ్మలూ చిత్రాలూ కొని అమ్మాయి గది అలంకరించమంటాడు.

మా—ఒస్. అదాండీ! ఆయన బొమ్మలు రాస్తాడు గావును. చెల్లటంలేదుగావును.

శా—మరేరోయ్! ఇంకా, మా పొరుగువారి అమ్మా యిని సలహా అడిగాను. అడిగితే, ఆ పిల్లఅందీ, వెనక మీసరళ ఒకయువకుణ్ణి ప్రేమించిందీ, సరళని అతడికిచ్చి పెళ్ళి చేస్తే సరళ వ్యాధిపోతుంది, అంది— మాఆవిడ అన్నట్టే!

మా—ఈసలహా బాగానే ఉందండి, నా అభి ప్రాయంలో.

శా—బాగుందీ! నీమొహం నీకేం తెలుసూ! విను. ఆ అమ్మాయికి మరో కొత్త గొప్ప వాడిమీద మక్కువ గావును, వాడికి మన సరళ మీద అభిప్రాయంగావును! అందుకని పాతవాడికి మన సరళని ముడెట్టేస్తే, కొత్తవాడు తనికి మిగుల్తాడుగదా అని, ఆపిల్లగోల!

మా—నిజమేనండోయ్! సలహా ఇచ్చేవారికి ఏరూపం గానో లాభం ఉండని సలహా పుట్టడమే కష్టం.

శా—మరేమిటనుకున్నావ్. సరి, ఇందాకా మా అన్న గారి అమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి అంటుందీ — "సరళకి పెళ్ళి అసలు కూడదూ! సరళ శరీరతత్వం — సున్నితమూ కోమలమూను! పెళ్ళిగనక అయి, కానుపుగనక వచ్చిందా, సరళ పరలోకానికి టిక్కట్టు కొనుక్కుండన్న మాటేనూ, అందుకని సరళకి ఈమామూలు సంసారావరణ తప్పించి సన్యాసినీ మఠంలో పేరువెయిస్తే దాని తత్వానికి అనుకూలిస్తుంది!" అని.

మా—అదేం సలహాఅండీ, దిక్కుమాలి సలహా!

శా—ఎందుకేమిటీ! సరళ సన్యసిస్తే నా ఆస్తికి వారసత్వం తనదేకదా అని! ఇల్లాంటి పాడుసలహాలన్నీ వాళ. వాళ్ళ వీపుల్ని కొట్టేసి, వాళ్ళని శీఘ్రంగా సాగనంపేశాన్ను నాజూకు సలహాలయొక్క దురుద్దేశాలు ఇల్లాఉంటాయి!

మా—మరి?

శా—మరా! (L B కేసి చూపించి) అదుగో, సరళ వస్తోంది. నువ్వెళ్ళిపో, కొంచెంసేపు! (అని R M కేసి చూపిస్తాడు.)

మా—చిత్తం (అని వెళ్ళిపోతాడు)

శా—అమ్మా! సరళా!

స—(నిట్టూర్పులు)

శా—అమ్మాయి! రా! ఎల్లాఉన్నావ్! వంట్లో ఒఖ్ఖరవ్వ నసిగాఉందా! అదే దుఃఖమూ అదే విచారమూ అయిపోయిందేమే! ఏమొచ్చిపడ్డదే కూతరా, కాస్త, చెప్పి పారెయ్యవే నాతోటి—చెప్పమ్మా, త్వరగా చెప్పూ-పిచ్చి పిల్లా, వెర్రితల్లీ—చూడు, నేను నాన్నని కాదవమ్మా మరీ! చెప్పు భయంలేదమ్మా, చెప్పెయ్, మాట్లాడవేమే! పోన్లేవే అమ్మా! నీవరసచూస్తే నాకు మతిపోతుందే! చెప్పవమ్మా మహారాజా! చెప్పు! ఈసందిగ్ధం నాకు ప్రాణపోకటగా ఉందే బాబూ! ఎందుకూ అంతపరధ్యానంతో ఉన్నావ్? కాస్తంత కారణం చెప్పేశావా, నేవిచారం తొలగించడానికి నేను చెయ్యంది ఉండదు. పోన్లేవే అబ్బా, ఇహ నేను మట్టుకి చస్తానా ఏమిటి?

స—(ఏమీ మాట్లాడదు.)

శా—మనోరికి మళ్లే డ్రెస్సూ అదీ నీకు లేదనా? కొత్తరకం వజ్రాలు అవీ కొనుక్కోవాలనా?

స—ఉఁ హుఁ ఉఁ

శా—కాదూ! కాకపోతే సిగదిలోకి తగ్గ బొమ్మలూ చిత్రాలూ అవీ లేవనా?

స—ఉఁ హుఁ ఉఁ

శా—అదీ కాదూ! మరేమిటే నీ యిల్లు బంగారం గానూ! పోనీ ఫిడేలుగిడేలు లాంటిది వాయిస్తూ పాటగీట లాంటిది నేర్చుగోవాలనా?

స—ఉ హుఁ ఉఁ...(నిట్టూర్పు)

శా—అదికూడా కాదూ! అల్లాయితే నన్ను చంపవే తీరిపోతుంది, సుబ్బరంగానూ! పోనీ, ఎవడేనా కుఱ్ఱకుంక మీాదికి మనస్సుపోయి, వాణ్ణిగాని పెళ్లాడాలని ఆలోచన చేస్తున్నావా అంటే...

స—ఉఁ

శా—(వినిపించుకోకుండా) నీ అంత చదువుకున్నది, అమాంతంగా, ఆ రీతిగా చెయ్యదుగదా! అందుకని కారణం అదీకాదు.

మా—(RM నించి వచ్చి) అయ్యగారండి!

శా—ఏమిరా, ఎందుకూ!

మా—మీాకోసం ఎవరేనా వచ్చారేమో, చూసి రానా అండి!

శా—అఖ్ఖర్లేదు. నువ్వుచూస్తేగాని రారా ఏమిటి, బోడివి.

మా—(మెల్లిగా) అయ్యగారండి. అమ్మాయిగారి విచారానికి కారణం తెలుసుగున్నారా అండి

శా—ఏమో, నా బుఱ్ఱ పాడవుతోంది.

మా—(మెల్లిగా) పోనీ, నేను అడగనా అండి. నాతో గాని చెబుతారేమో.!

శా.—నీ మొహం! నాతో ఇంత చెప్పింది, నీతో ఇక చెబుతుంది. తిక్క తిరిగేదాకా ఊరుకుంటే సరి! ఇల్లాంటి వాట్లకింతే! ( ఈసడింపు నవ్వు )

మా.—( మెల్లిగా ) కాదండి. మీరూరుకోండి నే అడుగుతాను ( గట్టిగా ) సరళమ్మగారూ! ఏమిటండీ, ఈ కోపం! ఆశ్చర్యంగా ఉంది. చెప్పెయ్యండి నాన్నగారూ నేనూ తబ్బిబ్బు పడిపోతున్నాం. చెప్పండీ! మీరు కోరుకోడమూ, నాన్నగారు కాదనడమూ, ఉంటుందా? ఏం కావలిస్తే అది తెస్తాం అన్నారుగా! మీ చిత్తం వచ్చినట్టు కోరుకోమని మీకే స్వాతంత్ర్యం ఇచ్చారుగా! మీరు షికార్లు మానుకున్నారు, పార్టీలు మానుకున్నారు. ఎవరేనా మీ మనస్సుకి బాధ కలిగించారా, లేక మీ మనస్సు బదులుచ్చుగున్నారా? లేక మీ మనస్సు హరించారా?...ఆఁ అదుగో...

స.—( నిట్టూర్పు )

మా.—మీ మొఖంలో తెలుస్తోంది. నిజం చెప్పండి. ఎవరో అబ్బాయి లేరూ? అతణ్ణి తెచ్చి మీ నాన్న మీకు పెళ్ళి చేస్తే బాగుంటుందని మీరు మనస్సులో రహస్యాలోచన చేసుగోటం లేదూ? ఆఁ...దాచకండీ! నిజం దాగుతుందిటండీ! ఆ మాట పైకి అనెయ్యక ఇన్ని వేషాలెందుకమ్మా, తల్లీ! ( శాస్త్రయ్యతో ) కిటుకు తెలిసి పోయిందండి, అయ్యగారూ!

శా.—ఇంత పెంకితనం అయితే, నేను సరళతో మాటే అణ్ణు...

స—నాన్నా! నా మనస్సులో కోరిక పైకి...

శా—ఊరుకో, నీమీద మండే ఆపేక్షంతా చంపు గున్నాను...

స—నేనూ...

శా—పెంచి పెద్దదాన్ని చేసి నందుకు, తగ్గశాస్తి చేశావు, మెట్టుకి...

మా—అదికాదండి, అయ్యగారు!

శా—నాకు నిజంగా చాలాకోపం వచ్చింది, ఇంకా వస్తోంది కూడానూ!

స—కాదు, నాన్నా

శా—ఇల్లాంటి వాళ్ళని వినిపించుగోవాలి కూడానూ!.

మా—అయ్యగారూ!

శా—గ్రంథ సాంగురాలు బయుద్దేరింది...

స—నురీ!

శా—కృతఘ్నురాలు...

స—నన్నా

శా—చదువుకుంటే మాత్రం, వ్యాధి పైకి చెప్ప కుండా కాల్చుగుటి నేస్తోంది మరీను!...

మా—అయ్యా! అమ్మాయి కోరుకునేది భర్తనిట.

శా—పరమ అసహ్యాం వేసింది, రోతపుట్టించి.

మా—అమ్మాయికి భర్త కావాలిట

శా—అందుకని నీకూనాకూ చెల్లు అనేస్తాను

మా—అమ్మాయికి భర్త కావాలిట

శా—నా కూతురు కాదు, దేవారనురాలు పొమ్మంటాను.

మా—భర్తట, భర్త, భర్త

శా—ఒక్క వాక్యం వినను, ఒక్కమాటవినను, ఒక్క అక్షరం వినను – మనస్సు చిట్టం కట్టింది—పోతాను! (అని RM కి వెళ్ళిపోతాడు) దూరంగా చక్కాపోతాను. (వెళ్ళిపోతాడు)

మా—మాశారాండి, సరళమ్మగారు! వినిపించుకోనివాళ్ళ చెవుడు అసలు చెముడుకంటె అన్యాయం.

స—దాని కేంగాని. నేను అసలుసంగతి చెప్పెయ్యక పోడం తప్పే, మొదట్లోనే చెప్పేసి ఉండవలసింది.

మా—పోనీ, యథార్థం నాతో చెప్పారు కారేం, మీనిమిత్తం నాప్రాణం అర్పిస్తాను కదమ్మా!

స—మా పొరుగమ్మాయితో చెప్పానుగా! ఆ అమ్మాయిసలహా మానాన్న విన్లేదు.

మా—మీ అమ్మగారితో చెప్పిచూశారా?

స—డబ్బూ దర్జా దర్పం హోదా టీవీ టెక్కూ ఉంటేనే గాని ఏసరుణ్ణీ ఏవరుణ్ణీ ఆవిడ మెచ్చదు. అవన్నీ ఉంటే వరుడు పీనరుడైనా వానరుడైనా ఫర్వాలేదుట. అందువల్ల నేకోరుకునే వరుడు ఆవిడికి నచ్చడని, నేను గ్రహించి ఆవిడతో చెప్పలేదు.

మా—ఆహమ్మా! మీ వరుడు సువర్ణం గారేనా?

స—ఔరా పిడుగా! ఎల్లా గ్రహించావ్ ?

మా—మీరు పైని చెప్పిన లక్షణాలు లేకుండా విద్యా వినయం సౌశీల్యం గురించి పేరు మోసినవాడు ఆయనే గనక !

స—ఆయన మనస్సు నాకు తెలియదు. నన్ను ఆయన స్వీకరిస్తారో లేదో! చదువుకున్న కాలంలో ముఖ పరిచయమే కాని, మాటేనా ఆడలేదు.

మా—అమ్మా! వాటిపూచీ నాది. సరళమ్మగారి గురించి నా తెలివిధారపోస్తాను.

స—నీ మాట సరే. ధైర్యమే. నాన్న...

మా—నాన్నా లేదు ఏమీ లేదు, ఊరుకోండి. సవ్య మైన వ్యాపారం నాన్నగారుమాత్రం ఎల్లా కాదంటారండీ? ఆయన మీ చిన్నప్పుడులాగ ఇప్పుడు మీ మీద అధార్టీ ఎల్లా చెయ్యగలరండీ? పెళ్ళి మీకే కదండీ? మీరు ప్రాజ్ఞులు, మీ పెళ్ళి నిమిత్తం మీకు ఓటు ఉండద్దూ! తక్కిన వాళ్ళకి ఓ రెండుకూ? పోసి, తక్కినవాళ్లకి ఏ పాతిక ఓటో పరక ఓటో ఉంటే ఉండచ్చు గాని, వాళ్ళకినిండు ఓటు కూడదు. నిండుఓటు మీకుండడం న్యాయం! ఉందుదూ! నేను చిన్న ఎత్తువేసి నాన్నగార్ని గమ్మత్తు చేసేస్తాను. మీరు మీ సుస్తీ, కొంచెం జోరుగా అభినయించండి. ఇవతలవాళ్ళ మాటలు వినిపించనట్టు నటించండి.

స—నువ్వా ?

మా—నేగా ఎల్లాగో వచ్చి మొత్తుగుని మీ నిమిత్తం వైద్యుల్ని తెప్పించి, మీనుస్త్రీ కుదర్చగల వైద్యుడు ఈయనే అని చెప్పి, ఏమాసికలోపడి సువర్ణంగారిని తీసుగొస్తాను.

స—ఆలస్యం కాకూడదు. ఆలస్యం అయితే మా అమ్మ ఏదో తనికి వచ్చిన సంబంధం మాటకట్టుగుని చక్కా వస్తుంది.

మా—ఆలస్యం క్షణంకూడా ఉండదండి. నా వ్యాపారం అంతా చిటికెల మీద నడుస్తుంది.

స—మా నాన్నగారికి కోపం తెప్పించకూడదు సుమా!

మా—నాన్నగారికి మిక్కిలి అంగీకారంగా ఉండేటట్టు, వారి కళ్ళముందే గ్రంథం నడిపిస్తాం, చూడండి. మీరు వెళ్ళి లోపల హాలులో పడుక్కోండి. వీధిగేటు దగ్గిరగా వేసేసి, అర్చిదారి పక్కగా మెట్లమీదపడి ఆయన లోపలికి రావడం కనిపెట్టి దీర్ఘాలు మొదలెడతాను. వెళ్ళండి.

స—సరే. జాగర్త. (సరళ LM కీ, మాలోకం RM కి పోతారు)

తెర

## రంగం - 2

(రెండవ తెర ఎదట)

కా—అబ్బ! తలకాయి వొంచుగుని పోతూందాం అను కుంటూంటే ఖుళ్ళీ ఏదో ఓటి వస్తూనే ఉంటూంటుంది.

గేటు వేసుంది. తలుపూ వేసేసింది. సరళ లోపలికెళ్ళినట్టుంది. ఇంతదాకా మాలోకమే కాకుండా సరళకూడా పెళ్ళికావాలీ అన్న మాట నాకు స్పష్టంగా వినిపిస్తున్నా, తక్షణ సమాధానం చెప్పలేకా, చెప్పగలిగినా దానికి తక్షణాచరణ లేని వీల్లేకా వినిపించనట్టు నటించాను. ఎల్లానూ ఊరుకోవలసినవాణ్ణే, పెళ్ళి అవసరం, పిల్లనోటంట విని కూడా ఊరుకున్నాననే కంటె వినక ఊరుకున్నాననుకోవడం ఎక్కువ గడుసుదనం! పెళ్ళి గురించి పిల్లంటే తొందర పడచ్చు; గాని తల్లిదండ్రులు ఎంత నిదానించాలీ! పిల్లదాని తొందరకీ తల్లిదండ్రుల నిదానానికీ సామరస్యం కుదరాలంటే ఆలస్యం కాకమానుతుందా? సంవత్సర మాత్రం ఉంటే చాలనే ఊరగాయి నెయ్యిడానికే బోలెడు ఆరాలు తీసేవాళ్ళుంటారే! అలాంటప్పుడు కల కాలమూ నిలవ వలిసిన సమ్మేళనం చేసేటప్పుడు ఎంత తటపటాయించాలీ! వివాహం అనేది ఛట్టున ఎల్లా? అన్ని ధరలతో పాటూ పెళ్ళి కట్నపు విలవలు కూడా మూడునాలుగు రెట్లు పెరిగిపోయాయి గదా! దీనికి ఓ కంట్రోలూ దిబ్బా ఉండాలని ఎవళ్ళూ ఆలోచించ రాయిరి! అయినా సరే, డబ్బు ఎల్లానో తెచ్చాం అనుకోండి, వరుడు మాట! పిల్లకంటె ఎక్కువ కాకపోతే అదే పాటు, పిల్లతో సమానంగా నేనా వరుడికి విద్య ఉండద్దూ, సమానంగా వయస్సు ఉండద్దూ, సమానంగా కులగోత్రాలూ నామరూపాలూ, పనిపాటలూ ఉండద్దూ! అలాంటి వరుడు దేశంలో ఉండనే! డబ్బెట్టి నగలయారు చేయించినట్టు డబ్బెట్టి

వరుణ్ణికూడా తయారు చెయించగలమా! మొగాళ్ళల్లో ఆరీతి సంస్కారం లేందే అల్లాంటి వాళ్ళు ఎల్లా ఉంటారు? ఉంటే గదా దొరకడం. ఒకవేళ ఏనాటికో కోటికో ఒకు ఉంటున్నా వాడూ వాణ్ణి అంతవాణ్ణిగా చేసినవాళ్ళ నాన్నా కలిసి తాటిచెట్టెక్కి మొవ్వల్లో కూచుంటారు. అల్లాంటివాణ్ణి కూడా దింపిమనం తేగలిగినా వాడు పిల్లకి నచ్చుతాడో నచ్చడో! వరతాలు హెచ్చిన కొద్దీ ఫలితం తగ్గిపోతుంది. మాపిల్ల సుస్త్రీ కుదరడంతోటే దాని వివాహం సంగతి నా చెయ్యి ఎల్లానూ దాటిపోయింది గనక, దాని ఇష్టం అంటాను. ధైర్యంగా అదే చేసుకుంటుంది, గాని, పెద్ద భయం ఏమిటంటే ఇల్లాంటి పేళ్ళంతా తలోగా! తొక్కుతున్నాడు. సుగాత్రి తుంటర్ని చెట్టపట్టింది. మరో అనున్నయి సుముఖిట అతురశూన్యుడికి అంకితం అయిపోయింది, సుకేశి ఒక జంతువు లాంటి వాణ్ణి నెత్తిమీదికి తెచ్చుకుంది, సునేత్రి భార్యా పిల్లలూ గలవాణ్ణి చూసుకుంది, సుకర్ణి ఒక వరహీనుడితో స్మృతిగలిపింది. ఒక సుహాసి నవ్వులపాలైంది, ఒక సుదంతి రచ్చకెక్కి గడ్డికరిచింది, ఒక సుపాణి విదేశీయుణ్ణి పీడనచేసింది. మరొక సురుచి వివాహం విసర్జించింది. అయితేం, మాపిల్ల నిదానం వేరు! అల్లా ఒఖనాటికి చెయ్యదు. సరే సరే. ఆ గోషంతా ఇప్పుణ్ణించీ ఎందుకూ! ఈసుస్త్రీ నిర్మాణించిన తరవాత ఆఘట్టం ఎల్లానూ ఉండనే ఉంది.–అంఅం. ఏదో ఏదుపు వినిపిస్తోంది! మాలోకం గొంతిగే! (అని LF కి నిష్క్ర-

మించగా, రెండవ తెర లేస్తుంది. L M నించి మళ్ళీ వెంటనే వస్తూ R M ని R కేసి తిరిగి, ఏడుస్తూన్న మాలోకాన్ని చూసి ) ఏదో జరిగింది, ఏదో జరిగింది! వీడు తెగ ఏడుస్తున్నాడు. నేను ఇందాకా అమ్మాయిని అంత కోప్పడకుండా ఉండవలిసింది.

మా—అయ్యో, ఎంత కర్మమండీ! ఎంత ఆపత్తు మీద పడ్డదీ! మా అయ్యగారు ఎంత దౌర్భాగ్యులో కదా!

శా—(LM నించి మెల్లిగా విచారంగా RM కేసి జరుగుతూ) ఏమిటి చెప్మా వీడి దోరణీ!

మా—మా అయ్యగారు ఏమవుతారో కదా ఈ వార్త వినే సరికీ!

శా—(కంగారుగా) వార్త ఏమిటో!

మా—అయ్యో, చిట్టితల్లిగారూ, అయ్యో అయ్యో (అని కుసిల్ళి బారుమంటాడు)

శా—హాయ్యో హాయ్యో, కొంప పడిపోయింది.

మా—అయ్యో (అని చీత్తాడు)

శా—(వణుకుతూ) మాలోకం!

మా—కర్మం ఎవరు తప్పించ గల్రూ?

శా—(కొంచెం గట్టిగా) మాలోకం!

మా—ఎంత ప్రమాదం!

శా—(ఏడుస్తూ మరీగట్టిగా) మాలోకమోయ్!

మా—ఏమి దురదృష్టం!

శా—(బిగించినపళ్ళతో దీర్ఘాలుగా) ఒరేయి! ఇల్లా చూడవేమిరోయ్!

మా—అయ్యో అయ్యో, వచ్చారాండి?

శా—ఆ. ఏమిటి!

మా—మరండీ! (అని గుటకేస్తాడు)

శా—(విచారంతో) సంగతేమిటో. తెల్చరా సీదుంప తెగా!

మా—సరళమ్మగారండి.

శా—(చాలా రకాలుగా ఏడుస్తూ) అయ్యో, అయ్యో!

మా—అదేం ఏడుపండీ, మరీనూ! ఎవరేనా నవ్వుతారూ!

శా—(కొంచెం తాపీగా) అయితే మరి చెప్పు త్వరగా!

మా—అమ్మాయిగారు, మీకు ఎదురాడలేక, మీ దారుణ కోపం తట్టుకోలేక, అమాంతంగా తన గదిలోకెళ్లి, కాలవ వేపుండే కిటికీ తీశారు.

శా—హాయ్యో హాయ్యో కూతరా

మా—ఆపళంగా, నన్ను పిలిచి, "నాన్నగారి కోపం ముందు నే బతకను. నాన్నగారు నన్ను కూతురే కాదంటాం అన్నారు. పోతాను." అన్నారు.

శా—(వికారంగా ఏడుస్తూ) కిందికి దూకేసింది గావును!

మా—లేదండి అయ్యగారు. నేను 'అమ్మాయిగారు, అమ్మాయిగారు, వద్దు వద్దు' అని బతిమాలుకున్నాను. ఆవిడ మెల్లిగా, కిటికీమూసేసి, దిగి, మంచం

మీద పడుకొని, వొళ్లు ఏడిచి, మొత్తుగుని, నోరారిపోగా, గుడ్లుతేలేసి, కర్రకారి, మూర్ఛిల్లి పోయారు!

శా—అయ్యో సరిశా, అయ్యో అమ్మాయీ, నడు నడు మూర్ఛే!

మా—నేను మొహం మీద నీళ్లుకొట్టానండి. తెలివొచ్చింది కాని, తిరగపెడుతూంటుంది. (విచారంగా) ఈ రాత్రి గడవడం కష్టమండీ, బాబూ!

శా—అయ్యో! బ్రాందీ ఇప్పిస్తే. సరే. నువ్వెళ్ళి పక్కవైద్యుణ్ణి పిల్చుగురా!

మా—ఊళ్లోకి ఇటీవలే కొత్త వైద్యుడొచ్చి అవతల వీధిలో దిగాడట, ఆయున్ని వెళ్ళి తీసుకురానాండి?

శా—అబ్బ! వెతుకడానికిప్పుడు వ్యవధి ఏదిరా. వెళ్ళు ఈపక్క ఇద్దరిలో ఎవరుంటే వాళ్ని తీసుకుచక్కారా! రోగం!

మా—పోసి అల్లాగే నండి, మాత్రం! (అని RM కి వెడతాడు)

శా—(ఒక్కడూ కంగారుగా పచారు చేస్తూ!) నయమే. ఇంత మట్టుకి అదృష్టవంతులమే. సరళేగనక కిటికీలోంచి కిందికి దూకేసి ఉంటే ఈపాటికొంప గుండం వేసుగుపోయేదిగాని, ఏమున్నా తరవాయి ఉందునా! ఈమూర్ఛ ఎందులోకి దిగుతుందో! ఇదో కొత్తరకం వ్యాధివచ్చి పడింది ఈమధ్య! గొప్ప సంబంధాలకంటూ ఊహూ ఎగడకపోతే తల్లిఘటం ఇక్కడ ఉండకూడదూ ఇల్లాంటప్పుడూ! అబ్బే,

ఎందుకుంటుందీ, ఆవిడ అవసరానికి ఉన్నా, అయినా వాళ్ళ మాట విన్నా, నాకు మరి కావలసిందేమిటి? రోగం రొష్టు చేసుకుంటేనేగాని పీల్లేదాయిరి. రొష్టు చేసుకున్న కొద్దీ అల్లులు యాగీ చేస్తారు. అల్లాంటియాగీ ఉత్తరోత్రా వివాహవిషయంలో విషమిస్తుంది. ఏంజెయ్యనూ!

[ RM నించి మాలోకం వస్తూ ]

మా—అయ్యగారండి. ఇరుగోనండి.

శా—( RM కి చూస్తూ ) రండి. మా అమ్మాయికి సుస్తీగా ఉంది. హాలులో ఉంది.

ధన్ మన్—(RM నించి వచ్చి) మీరిక్కడేఉండండి మేం చూసొస్తాం ( అని LM కి నడుస్తారు )

శా—ఒరేయి, అక్కడ చెయ్యికడుక్కోడానికి సబ్బూ నీళ్లూ తుడుచుగోడానికి తువ్వాలూ ఉన్నాయి కాదురా!

మా—చిత్తం. ( ధన్ మన్ లు LM కి వెడతారు )

శా—( మెల్లిగా ) ఒరేయ్!

మా—( మెల్లిగా ) అయ్య!

శా—నువ్వు ఎంతమంది డాక్టర్లని పిలిచి వొచ్చావురా?

మా—ఒకర్నేనండి. రెండో ఆయన నేపిల్చే సమయంలో మొదటి ఆయనతో మాట్లాడుతున్నారట, నేను 'ఏమండోయ్, మా యజమాని మిమ్మల్ని తీసుకురమ్మన్నారండి' అన్నాను. అంటే ఇద్దరూ వచ్చేశారు.

శా—పోనీలే ఈయిద్దరూ చాలరంటావా?

మా—ఒక్క మనిషి పోవడానికి అసలు ఇద్దరుమాత్రం ఎందుకండీ?

శా—ఏమిట్రా, ఏమిటా వేళాకోళం! ఒక ఆలోచన కంటె రెండు ఆలోచనల జోడింపునయమేమో అని నేనుఈఅదు ర్దాలోపోనీ అని ఒప్పుకుంటున్నాను!

మా—నిజమేనండి. వైద్యసహాయం లేకుండా పోవడానికి ఆలస్యం అవుతుంది.

శా—ఛ. వాళ్ళకి వినపడుతుంది. ఊరుకో! వైద్యం వల్ల పోతారంటావేమిటీ, పాడుమాటలూ నువ్వూనూ!

మా—నిజమేనండి. మరణం అనేది జ్వరంవల్లా క్షయవల్లా అజీర్తివల్లా ఎల్లా కలుగుతుందో, వైద్య బాహుళ్యం వల్లా, అల్లానే కలుగుతుంది.

శా—నిమ్మళంగా మాట్లాడు. వాళ్లు వింటే చంపేస్తారు.

మా—అదేనండి, నేఅనేమాటాను! మన పిల్లి ఈమధ్య చెట్టు మీంచి పడిందాండీ! అది నోరు మెదపకుండా కాలు కదపకుండా మూడు రోజులపాటు ఎందుకు బతగ్గలిగిందీ—పిల్లి వైద్యుల సహాయం లేకపోడంవల్లే! మార్జాలభిషక్కు లేగనక ఉంటే. ఒక్క గంటలోపలే ఆపిల్లిని పిల్లిమంత్రాలు వెయించేసి ఉండేవాళ్లు.

శా—ష్. చాల్చాలు. మరివాక్కు. వాళ్లిల్లా రాగల్రు.

మా—అవునండి. వచ్చి, మీ అమ్మాయికి పట్టిన జబ్బు ఒక్క ముక్క తెలియకుండా స్పష్టమైన వింత భాషలో చెబుతారు.

(తలుపు తీసిన చప్పుడు) (ధన్ మన్ LM నించి వస్తారు)

శా—రండి. ఏమిటి సెలవు?

ధన్—అయ్యా! రోగిని జాగ్రత్తగా పరీక్షించాం. సందేహం లేకుండా ఆవిడ దేహంలో అనేక విషాలున్నాయి.

శా—ఔర! అంత విషమించిందాండీ!

మన్—అనగా, చాలా విపరసాలు ఆవిడలో ప్రకోపించాయి.

శా—చిత్తం.

మన్— మేమిద్దరం ఇంకా కొంత కూడబలుక్కుని చెప్పాలండి.

శా—అల్లానే కానీండి, ఒ రేయి. రెండు కుర్చీలు తెచ్చి వెయ్!

మా—చిత్తం (అని LB నించి రెండుకుర్చీలు తెచ్చి వేస్తాడు)

మన్—ఎమోయ్, మాలోకం! జ్ఞాపకం ఉందా?

మా—చిత్తం. తమర్ని మరిచిపోవడం తేలికా అండి!

మన్—ఆ, వీరి బంధువులింటి దగ్గిర కలిశాం కాదూ మొన్నా!

మా—చిత్రం చిత్రం!

మన్—వారి బండివాడికెట్లా ఉంది?

మా—ఇప్పుడేం లేదండి. వాడు ఆరోజునసే టిక్కెట్టుచ్చుగున్నాడు.

మన్—ఎక్కడికీ?

మా—పైకి.

మన్—ఛ. అది కేవలం అసాధ్యం.

మా—ఏం అసాధ్యమోకాని, ఆ వేళ వాణ్ణి మట్టి చేశారండి మరి!

మన్—వాడు మరణించడానికి అవకాశం లేదే?

మా—అయితే మీరే కనుక్కొని తేల్చాలిగాని, నావల్లకాదు.

మన్—వైద్యకారు డన్నదాని ప్రకారం ఆవ్యాధి పద్దాలుగో రోజునగాని, ఇరవై ఒకటో రోజునగాని, ప్రాణం తీసేస్తుందేగాని ఆ లోపున తీసెయ్యదే?

మా—బహుశా ఆ సంగతి తెలియక వాడు తొం దరపడ్డాడు గావునండి,

ధన్—సరి, ప్రస్తుతాంశం మేం ఆలోచించాలి. మీరు లోపలికి దయచెయ్యండి.

మా—నేనూనాండి!

శా—ఆ (అని వాడు నోరుమూసి తీసుగుపోయినట్లు అభినయించాలి LM కి పోతారు)-(తలుపుతీసి మళ్ళీదగ్గిరిగా వేసిన చప్పుడు)

ధన్—(కుర్చీ ఎదటికి లాక్కుని) ఇల్లా కూచోండి, డాక్టర్ మన్

మన్—చిత్తం, డాక్టర్ ధన్

ధన్—ఏం చెబుదాం?

మన్—అబ్బా, ఏదో వోటి చెబుదాం లేస్తూరూ! మీరు రోగులదగ్గిరికి ఎల్లా పోతూంటారు?

ధన్—మీ రెల్లా పోతూంటారు? నడిచా?

మన్—కాదులెండి, వం పెద్ద బండీమీద. తమరి దేం వాహనం?

ధన్—సైకిలండి. గుఱ్ఱాన్నికూడా ఉమద్యేశొన్నాను. రోజుకి కొన్ని మైళ్ళు తిరగాలి, నేను.

మన్—పని పూర్తిగా ఉండాలి గాని, వెధవ తిరుగుళ్లు తిరగ డానికి గుఱ్ఱమూ గాడిదా ఎందుకండీ?

ధన్—మీరు అట్టే తిరగక్కర్లేదు గావును! పాపం!

మన్—మీ దయవల్ల చాలమంది నా దగ్గిరికే వచ్చేస్తారు. సరే కానండీ, ఆ అలోపతీ ఉమాపతీ దెబ్బలాటల్లో, మీది ఏపక్షం?

ధన్—ఏపతికి ఆచిక్కులున్నాయిగాని, నాది హోమియో పతీ పక్షమే! రోగి పోయినా సరేగాని, అలోపతీలో సబబు గొప్పది!

మన్—నాకూ సబబు గురించి మా చెడ్డపట్టింపు ఉంది. సలహాలు యథావిధిగా ఉంటేనే గాని నేను ఒప్పను.

శా—(LM నించివచ్చి) అయ్యా, నమస్కారం.
పిల్లదానికి బ్రాంతిగా ఇదిగా వుంది. సుస్త్రీఫలానా అని తమరు త్వరగా తేల్చాలి.

ధన్—మీరు తేల్చండి, డాక్టర్ మన్

మన్—నేనా, ఎంతమాటా, మీరే తేల్చండి, డాక్టర్ ధన్.

ధన్—ఆఁ, తమరు పెద్దలు చెబుతురూ!

మన్—ఆఁ, తమరు కుశాగ్రబుద్ధులు, ఉపక్రమిస్తురూ!

ధన్—బాబుకాదు

మన్—నాయనకాను!

ధన్—ఆఁ హాఁ

మన్—ఊఁ హుఁ

శా—ఏమండోయ్, మీపట్టింపులకీ మీకూ వేరు వేరుగా దణ్ణం! మీరు తెమల్చాలి. ఇవతల ఆందోళన గమనించండి.

ధన్, మన్—అయితే వినండి.

శా—ఔరా! ఒక్కొక్కడే కానీండయ్యా, బాగానే కుదిరిందిమేళం, ఇద్దరూ ఇద్దరే!

ధన్—అయితేముందు నేచెబుతున్నాను కాస్కోండి, మీఅమ్మాయిసుస్త్రీ రక్తోష్ణత! రక్తపరిహారం చేస్తేనేగాని మీపిల్ల జీవించదు.

మన్—మరి నామాట వినండి. ఆవిడ తత్వంలో రసాలు వృద్ధై కల్లి పోయినాయి. విరేచనభేది ఇవ్వాలి.

ధన్—భేదిఇస్తే ఏమండోయ్, భేదిస్తే ఆ అమ్మాయి బతకదు.

మన్—రక్తపరిహారంచేస్తే ఆ అమ్మాయి ఉండదు.

ధన్—నీపాండిత్యానికి చాలా సంతోషించాంలే, డాక్టర్ మన్

మన్—నీవిద్యకి చాలా ఏడిచాంలే, డాక్టర్ ధన్.

ధన్—అవును. కిందటివారం ఓమనిషిని టపా కట్టించావ్.

మన్—అవును సిన్నపొద్దున్న ఓణ్ణి యముడికి సిఫార్సు చేశావ్.

ధన్—సేనయ్యగారూ! నా సలహారూఢి

మన్—సేనయ్య గారూ! నాసలహారూఢి

ధన్—రక్తపీడన తగ్గించకపోతే మీ అమ్మాయి అరగంటలో పోతుంది.

మన్—రక్తపీడన గనక తగ్గిస్తే మీఅమ్మాయి పావు గంటలోపలే పోతుంది.

శా—మాలోకం! ఎంత ప్రాబుద్ధం వచ్చిందిరా వీళ్లిద్దర్లో ఎవర్ని నమ్మేదాంరా ఇప్పుడూ ?

మా—ఇద్దర్నీ నమ్మండి! నేను గట్టివాణ్ణి వెతికి తెస్తానంటే వద్దాన్నారుగా! డాక్టర్లూ! తమ అభిప్రాయాలు ఒక్ఖరవ్వ విరుద్ధంగా ఉన్నాయి.

శా—అయ్యా! తమరు అనుభవజ్ఞులు! తమరిద్దరూ కలిసి, నిదానంగా ఆలోచించి అద్వితీయమైన కర్తవ్యం ఒక్కటి మాత్రమే సెలవిప్పించాలి.

మన్—అల్లాయితే, మేం ఇంకా కలిసి ఆలోచించాలి. మీరు లోపలికి వెళ్ళండి.

శా—చిత్తం. రారా మాలోకం (అని LMకి వెళ్లిపోతారు)

ధన్—(స్వరం నొక్కి) ఔరా! డాక్టర్ మన్! నామాట కొట్టేస్తావా?

మన్—నువ్వు నా మాట కాదంటావా?

ధన్—ఊరుకో, నువ్వు ఉత్తమట్టి కలిపి మాత్రలని ఇస్తున్నావ్

మన్—ఛీ, నువ్వు ఉత్తనీళ్ళు కలిపి మోతాదులని ఇస్తున్నావ్

ధన్—ఊరుకో, చవటా, నువ్వు రోగం పసికట్టనే లేవూ!

మన్—ఊరుకో, దద్దమ్మా, నువ్వు లేనిరోగం ఉండంటావ్!

ధన్—నోరుముయ్! నువ్వు జనాన్ని చావగొడుతూంటావ్!

మన్—ఛీ, వాక్కా, నువ్వు జనాన్ని చావగొట్టనేనా లేవ్! (అంటూ పళ్ళు కొరుకుతాడు)

ధన్—ఏయ్, ఆ పళ్లు కొరకడం మానా్తవా, పళ్ళు రాల గొట్టనా!

మన్—ఈలోపల నీకు నేనే చేస్తాను అంతపనీ!

ధన్—ఈలోపల నేను పళ్లుతీసి దాచేసుగుంటే నువ్వు ఏమున్తూ కూచోవాలి.

మన్—కట్టుపళ్లా! (అని వెకిలిగా నవ్వుతాడు)

ధన్—ఆ మాట నేనన్దే నువ్వెందుకూ అనడం? (అని క్రాపింగు పట్టుగుని వంచుతాడు) అయితే ఇదుగో, తిను (అని చెంపవాయిస్తాడు)

మన్—అబ్బ! (అని పీల్చాలి) క్రాపింగు వదిలిపెట్టబ్బాయి, చెబుతున్నాను, నెప్పెడుతోంది. క్రాపింగు ఊడిపోయినా, చెరిగిపోయినా, మరుపునష్టందావా వేస్తాను.

ధన్—వెయ్, అప్పుడిచ్చేస్తాను. తిన్నగా ఉంటావా!

మన్—ఆ. తీరా ఆయనొస్తె బాగుండదు, వొదిలెయ్యండి.

ధన్—సరే, వొదుల్తున్నాను. మనికి ఒక వేళ మళ్ళీ దెబ్బలాటవస్తే ఈస్థితిలో మొదలెట్టాలి.

మన్—అబ్బ, మెడ నెప్పెట్టిందండీ! కాని, మనం కొట్లాడుకుంటే ఏం లాభం? వాదన్లు పెంచుగునే వాళ్లని జనం తేలిగ్గా కడతారు. మన చేతుల్లో జనంపడి తీరేటట్టు దేవుడు రాసి పెట్టాడు. మనుష్యుల లోపాలు కనిపెట్టి గడసర్లు సొమ్ము చేసుగుంటారు. కొందరికి స్తోత్రం చెయించు

గోడం ఇష్టం అందుకని స్తోత్ర పాఠకులు డబ్బుగణిస్తారు. కొం దరికి బంగారం చేసే విద్యఇష్టం. అందుకని సువర్ణయోగం చెబుతాం అనేవాళ్లు డబ్బుగణిస్తారు. అన్నింటిలోకీ ప్రాణం మీదతీపి మానవుల పెద్దలోపం. ఆలోపం ధర్మమా అని మనం కుబేరులం కావచ్చు. జయం మనవల్లా, అపజయం ప్రకృతివల్లా వస్తూంటాయని రోగులు నమ్మేటట్టు చెయ్య వచ్చు. రోగికి బాగుపడ్డా మనమీద కోపండుండదు, చచ్చినా మనమీద కోపం ఉండదు! సోదరా, ఇల్లాంటి వృత్తిలో, మేట్లాది ధనం చేసుగోక, పోట్లాడుకోడం ధర్మమా?

ధన్—సోదరా! నీమాట నిజం! కాని, ఒక్కొక్క ప్పుడు నాకు మా చెడ్డకోపం! పాపం, మిమ్మల్ని మాగట్టి లెంపకాయ కొట్టాను!

మన్—ఆఁ దాని కేంలెండి మీరు పెద్దలని నేనూరు కున్నాను. కాని, ఈసందర్భంలో, మనం కలిసినట్టు కనిపిస్తే చాలు,యథార్థంగా కలవనక్కర లేదు!

ధన్— మిత్రమా! అల్లానే కానీండి.

మన్—ఈరోగికి నాయిష్టంచొప్పున చెప్పనీండి. ముందు మాటు రోగికి మీయిష్టం అనుసరిద్దాం.

ధన్—తథాస్తు! ఇంతసలహాకి కృతజ్ఞుణ్ణి, సోదరా!

మన్—సరి ఇక ఆయన్ని పిలుస్తాను.

ధన్—పిలవండి.

మన్—నేను నిదానించి చెబుతూంటాను, మీరు తెడుపు కోకుండా దంచెయ్యాలి.

ధన్—ఓ. మీచిత్తం,

మన్—ఏమండోయ్ (అని చప్పట్లు కొట్టి) రండి, చెబుతాం

శా—(L M నించి వచ్చి, ఇద్దరిమధ్యా నుంచుని దణ్ణం పెడుతూ) చిత్తం!

మా—(శానయ్యతో L M నించి వచ్చి R F కి పోతాడు)

మన్—(మందంగా) ఇల్లాంటప్పుడు—నిరంతరాలోచనా—విశేష నిదానమూ—తో, పని—చెయ్యాలి. ఏమంటే—ప్రథమ ప్రమాదం—కించిత్తే అయినా, పర్యవసానం—విషాదాంతం—కావచ్చు: అని, భిషక్ప్రవర్తి అయిన

ధన్—(పాటలాగ గబగబా) నిజమే. చాలా జాగ్రత్తతో పని చెయ్యాలి. ఇదేమీ వేళాకోళం కాదు. కాలు జారినా మాటజారినా తీసుగోడం కష్టం. ముందు జారినా అంతే. ఒలికిన పాలు మరి ఎత్తలేం కాబట్టి ముందుగానే తర్జన భర్జన పడాలి, రోగుల శరీర తత్వాలు పోల్చుకోవాలి, వ్యాధుల మూలాలు పసికట్టాలి, తగ్గ ఔషధాలు నిర్ణయించాలి.

శా—ఔరపుణ్యం! ఒకాయన తాంబేలు పడక, రెండో ఆయన లేడిపరుగు!

మన్—అయ్యా! మీకుమార్తె వ్యాధికిమూలం ఏమిటి అంటే–, లక్షణాలన్నీ చూడగా– అన్నకోశాశ్రితమై– దుష్టమై– నిబిడమై– నిరంతరమైన– రసమిశ్రణంలోంచి–

బయల్దేరి-పూర్తిగా వెళ్ళి- మనుష్య శాస్త్రాల్ని- మంటలెత్తించే- ఒకవిధమైన- ఆకలిరోగం

ధన్—అవును. పైగా అన్నకోశంలో ఆ వివిధరసాలు ఉత్పన్నం కావడమూ, అక్కడే అవి చిరకాలవాసం చెయ్యడమూ, గత్యంతరం లేక అవి ఘనీభవించి గడ్డకట్టడమూ, ఆస్థితిపరివర్తనం జరిగే మూహూర్తంలోనే విషగంధాలు ఏర్పడడమూ, వాటిస్వభావ ప్రకారం అవి తిన్నగా తలకెక్కడమూ, జరిగింది

మన్—కాబట్టి, ఆవిష రసాల్ని- అక్కణ్ణించి- పారద్రోలడానికి- మంచి- విరేచన భేది- అవసరం—

ధన్—ఆ తరవాత మేం అవసరాన్ని బట్టి సమయానుకూలంగా సందర్భానుసారంగా యథాశక్తిగా యథావిధిగా యథాతథంగా రక్తోత్సర్జన మొదలైన చికిత్సలు జరుపుతాం

మన్—తె-లి-సి-ం-దా? మీకు తె-లి-సిం-దా?

ధన్—తెలియులా? మీకు తెలియులా? తెలీలా!

శా—అయ్యా! మందండాక్టరుగారూ! మీకు-అనేక-వినయపూర్వక-వందనాలు! అయ్యా, చురుకుపాలుగారూ! మీరీ విషయంలో విశేషంగా తంటాలుపడ్డారు గనక మీకు నేను సతతమూ సర్వకాల సర్వావస్థల్లోనూ సరిగ్గా కృతజ్ఞుణ్ణి. ఇద్దరూ దయచెయ్యండి. క్రమేపీ దర్శనం చేసుకుంటాను.

ధన్—మీ దర్శనం అవసరంలేదు. మా దర్శనాలకీ సలహాలకీ బిల్లులు, వేర్వేరుగా, పంపుతాం! మన్నించండి!

శా—చిత్తం చిత్తం.

(ధన్, మన్‌లు RF కి వెళ్ళిపోతారు.)

అమ్మయ్య! (ఆయాసంతో) ఒరేయ్ మాలోకం!

మా—అయ్య అయ్య! ఏమన్నారండీ! (అంటూ RF నించి వస్తాడు)

శా—ఏమన్నానా! ఇంగితజ్ఞానం లేనివాళ్ళని పిలిచే వాళ్ళకి ఇంగితజ్ఞానం ఎల్లాఉంటుంది అన్నారు! ఇద్దరూ చెరో పీసెడు అజ్ఞానమూ నాకు దానం చేసి, నాబుర్రలో కూరేశారు.

మా—మీరేకాదండీ ఈ పక్కవార్ని పిలవమంటా!

శా—అపరాధం! కొత్త వైద్యుడన్నావేం, పోనీ వాణ్ణి తీసుకురా సైకిలుమీద వెళ్ళి! ఊఁ (అంటూ, చిటికెలు వేస్తాడు)

మా—చిత్తం (LF కి వెళ్ళి సైకిలు తెచ్చి RFకి సైకిలు తీసికెడతాడు.)

శా—అబ్బబ్బ! ఎల్లావచ్చిందీ చిక్కు! రోగి దగ్గర నేను ఒఖ్ఖణ్ణే కూచోడం నాకు భయం! అందులోనూ రోగి మూలుగుతూంటే మరీ భయం! పైగా కారణం ఏమిటో తెలియకపోతే చెప్పనే అక్కర్లేదూ! అదీకాక, స్వజనం బాధచూస్తూ అసలు భరించలేను! అన్నీ అట్లాఉంచి మా సరళంత ఉత్సాహవంతురాలు హింసపడి పోతూంటే చూస్తూ కూచోడం నాతరమా! పిల్ల ఎంత నీరసించిపోయిందీ! ఆ తాంబేలు డాక్టరూ అంతే, ఆ లేడి డాక్టరూ అంతే! వాళ్ళ

సొమ్మసిల్లిపోయింది! విరేచనభేది ఇవ్వాలట! పిల్ల మరీనీరసించి పోయి పిల్లకి ఆశాస్త్ర మాటాకుడా నిజంగాపోతే ఎంజెయ్యా వచ్చుదూ! రోగం రాగానే బాధ, వైద్యం చెయించకపోతే బాధ, వైద్యం చెయిస్తే మనోబాధ, చేస్తూన్న వైద్యం మనికి నచ్చకపోతే బాధ. చేస్తూన్న వైద్యుణ్ణి మానిపించడం ఇంకాబాధ, అప్పుడు మరోణ్ణి కుదుర్చుకోడం చాలా బాధ! ఈవచ్చే కొత్తవాడు ఏమి సార్లాచేస్తాడో! పోనీ, పిల్లకి సుబ్బరంగా ఇంత సిద్ధరట్టినా బతుకుదుం! ఎందుకేనా మంచిది, ఒకపనిచేస్తాను. అంతయ్య ఇల్లు ఆట్టే దూరంకాదు. అతడికి బ్రాందీ వ్యసనం ఉంది. అతణ్ణడిగి కాస్త బ్రాందీ పట్టుగొస్తాను. అది ఒక్ఖ రవ్వఇస్తే కొంచెం వేడి అందుకుని నిలబాటు చేస్తుంది. తరవాత చూసుగోవచ్చు.

( RF కి పోతాడు — తెర )

రంగం - 3

( రెండవ తెర ఎదట RF నించి ముందు మాలోకం వస్తాడు )

మా—( మెల్లిగా ) రండి, రండి సువర్ణంగారు!

సు—( RF నించివచ్చి ) ( మెల్లిగా ) టట్! నన్ను సువర్ణంగారు అనకు డాక్టర్ అను.

మా—చిత్తం. అల్లానేనండి.

సు—(మెల్లిగా) యజమానిగారు! ఏంజేస్తున్నారో చూడు!

మా—పిలుస్తానుండండి. (LF కేసి జరిగి) అయ్యగారూ! అయ్యగారూ! ...లేరండి. ఎక్కడికేనా వెళ్ళారేమో! మనం గట్టిగానే మాట్లాడుకోవచ్చు.

సు—సరే, నే నెల్లా ఉన్నానూ?

మా—పెళ్లికొడుకులా ఉన్నారు!

సు—అదికాదోయ్, డాక్టర్లా ఉన్నానా?

మా—మీరు మనోవైద్యులుగా! పైకి ఎల్లా తెలుస్తారూ!

సు—యజమాని నన్ను పోల్చేయ్యాడు గద!

మా—పోల్చడం ఆయన వశంటండీ! ఆయన మొదదు దళసరి. ఒక వేళ ఆయన పసిగట్టినట్టు కనిపిస్తే మరో ఎత్తు వేస్తాం.

సు—అంతా నీలో ఉంది.

మా—నే నెల్లాంటి వాణ్ణి?

సు—వెన్నలాంటి వాడవ్.

మా—అల్లాంటి వాణ్ణి గదాండీ, ప్రేమవంతుల బాధలు చూస్తూ ఊరుకోగల్నాండీ!

సు—ఊరుకోలేవు.

మా—కొందర్ని మొదటి సారి చూడగానే అసహ్యం వేస్తుంది. మిమ్మల్ని చూడగానే కొత్త వాళ్ళకి స్నేహం పుడుతుంది. సరళమ్మగారికి తగ్గ వారు మీరేనండి.

సు—నీ దత్తు. ఈ పన్నాగం నెగ్గాలికదా !

మా—నిమిషం అండి. ఉండండి. మాయజమాని గారు వస్తున్నారు. (RB కేసిచూపించి) మీరు ఈయింటి పక్క ఉండండి. మీ కోసం మళ్లీ వస్తాను. ప్రస్తుతం నా వెన శాలే దాక్కుంటూ ఆయన రావడంతో నిష్క్రమించండి.

సు—సరే సరే. (అని అట్లా చేస్తాడు)

మా—రండి, రండి, రండి అయ్యగారూ, రండి.

శా—(RF నించి బుర్రవంచుకుని చేతులు వెన కాల కట్టినట్లు పట్టుకుని) ఏమి టేమిటీ!

మా—సంతోషమండి అయ్యగారూ, సంతోషం!

శా—సరే సరే, ఏమిటి సంగతి ?

మా—ఆనందించండి.

శా—సరే, ఎందుకని ?

మా—ముందు ఆనందించండి, తరవాత చెబుతాను.

శా—అబ్బ ముందు చెప్పు, తరవాతపోనీ అల్లా నేఆనం దిస్తాను. అబ్బ! అస లెందు కేమిటీ!

మా—నే చెబుతున్నాను కాదండీ అయ్యగారూ!

శా—సరే పోని, హిహిహీ...సంగ తేమిటీ ?

మా—మెత్తగా నవ్వండి!

శా—ఇదుగో! (అని మెత్తగా నవ్వి) ఏమిటో చెబుదూ!

మా—కొద్దిగా పాడండి ఆయ్ రనీ

శా—అబ్బస రేరా, ఆయ్ రనీ...ఏమిటివిషయం? అమ్మాయికి వంట్లో...

మా—నిమ్మళించిందండి.

శా—(సంతోషంతో) ఏమిటీ? సరళకి నిమ్మళించిందా! అప్పుడే! ఇంతట్లోనే.

మా—అడ్డమూండి! నేను ఆకొత్త డాక్టర్ని నిమిషంలో పట్టుగుని తెచ్చాను.

శా—ఇంతట్లో వైద్యం పూర్తి అయిపోయిందా?

మా—లేదండి. మీరు రాందే!

శా—మరి నిమ్మళించింది అంటా వేం? ఏడిచేవాణ్ణి నవ్వమనీ!

మా—అంటే, అంతమూఢిగా నిమ్మళించి తీరుతుందండి.

శా—ఎక్కడున్నాడు? కొత్తవైద్యుడూ!

మా—మీరొచ్చేదాకా ఈపక్కని ఉండమన్నాను.

శా—సరే. తీసుగురా, కడంవాళ్ళకంటె నయమేమో చూద్దాం.

మా—ఉండండిమరి. (చప్పట్లు కొడుతూ RF కి వెళ్ళి) ఏమండోయ్, రండి. ఇరుగోనండి. (సువర్ణం RF నించి వస్తాడు)

శా—ఈయనా! ఈయనకి మామూలు డాక్టర్ల ఫటాటోపం లేదేం?

మా—పటాటోపాన్ని బట్టా అండీ పాండిత్యం నిర్ణయించడం! సామర్థ్యం అగోచరం గదా అండి.

శా—నిజమేరా, మా లోకం పోనీ అల్లానే ఏమండీ, మహాశయా, మీ దగ్గిర పేగుల్ని తూళేణ చేసే కుప్పెలు అద్భుతమైనవి ఉన్నాయట, నిజమేనా?

సు—అయ్యా, మా మందులు మామూలు రకం కాదు. అల్పవైద్యులైనవాళ్ళు భేదులూ, మూలికలూ, ఓషధులూ, పొడిచే రసాలూ వాడతారు. కాని మేం ధ్వనులూ, మాటలూ అక్షర పత్రాలూ, (తా యెత్తులూ, రక్షరేకులూ) యక్షిణీ ఉంగరాలూ వాడతాం

మా—నే చెప్పలేట్టండీ, అయ్యగారూ! ఈయన మాదిరే అద్భుతమండి!

శా—అవున్రా. మొదలెట్టగానే తెలుస్తోంది ఈయన అఖండుడని.

సు—మీరేనా యజమాని?

శా—చిత్తం, డాక్టరుగారు, నేనే యజమానిని

సు—మీ కుడిచెయ్యి ఇల్లా తెండి, నాడి చూస్తాను.

శా—ఇదుగో

సు—ఇంకేం? మీ అమ్మాయికి సుస్తీగా ఉంది.

శా—ఔర, అసాధ్యుడా! మా అమ్మాయి సుస్తీ నా నాడి బట్టే నీకు తెలుస్తోందా?

సు—ఓ భేషుగ్గా! పితా పుత్రికల నాడులు వివాది స్వరాలలో కొట్టుకుంటూ ఉండవచ్చునని మా వైద్యంలో సిద్ధాంతం

మా—సరళమ్మగారిని పిలవనాండి, అయ్యగారు!

శా—రమ్మను, నెమ్మదిగా రమ్మను.

[ రెండవ తెర లేవగా ఇంట్లో ఒక గది—LM నించి సరళ, మాలోకం వెనకాల వస్తుంది ]

మా—రండి, సరళమ్మగారు. ఈకుర్చీ మీద కూర్చోండి. ఇకరండి అయ్యగారు! మనం ఇల్లా పక్కకి తప్పగుని నుంచుందాం.

శా—నే నిక్కడే ఉంటాను.

మా—అబ్బే, మనం ఉండ కూడదండి. రోగిని. అనేక ప్రశ్నలు వేస్తారు డాక్టరుగారు. తక్కినవాళ్ళు ఆప్రశ్నలు వినడం అధర్మం.

శా—సరే లేస్తూ! ఇక్కడ నుంచుంటాను. నువ్వెళ్ళు (అని LF దగ్గిర నుంచుంటాడు)

మా—చిత్తం

ను—ఈవిడ పేరేమిటి, సరళకాదూ అన్నారూ! ఓసరళగారూ! మిమ్మల్ని చూడడం నాకు చాలా సంతోషం. ఏ మాటల్తో సంభాషణ మొదలెట్టాలో తెలియడం లేదు. ఇప్పటిదాకా మిమ్మల్ని చూడడం మాత్రంచూశాను. ఇప్పుడు నాలిక మించి మాటకూడా స్వేచ్ఛగా బయలు దేరబోతూన్నా సంతోషం మితిమీరడంవల్ల నాలిక ఆడటం లేదు.

స—నేనూ అంతే. మీకు మల్లేనే, అతి సంతోషంలో నోరు విప్పలేకుండా ఉన్నాను.

సు—నా మనస్సులో నాకు అనిపించినట్టే...

స—నా మనస్సులో నాకూ అనిపిస్తోంది.

సు—నాహృదయంలో ఉన్న సంగతి...

స—సంగతే నా హృదయంలోనూ ఉంది.

సు—అలా నన్ను మీరు అనుకోనిస్తే, ధన్యుణ్ణి.

స—అలామీరు అనుకోగలిగితే ధన్యురాల్ని

సు—నన్ను రప్పించడానికి ఈపన్నాగం మీరు వేసిందేనా?

స—పన్నాగం నేను వెయ్యలేదు. అదుగో, మాస్నగారు!

శా—(మెల్లిగా) ఒరేయ్, మాలోకం

మా—(మెల్లిగా) అయ్య!

శా—(మెల్లిగా) వాడు సరళ మొహంమీద మొహంపెట్టి మరీ అల్లామాట్టాడుతున్నాడేం?

మా—ఆఁ ఏముఁదీ! ముఖరేఖలు నిర్ధరించి, ముఖలక్షణాల వయినం కనిపెడుతున్నారు.

సు—సరళా! నువ్వు నాయందు కనపరిచేటటువంటి ఈ ప్రేమ ధ్రువమేనా?

శా—(మెల్లిగా) ఒరేయ్, ప్రేమ అంటాడేమిట్రా!

మా—అబ్బా, ఏమిటండీ ప్రతీదానికీనూ! అది కొత్త వ్యాధి గావును!

స—నా ప్రేమ ధ్రువం మీ నిశ్చితాలు మీరుపాటిస్తారా?

సు—కలకాలమూ పాటిస్తాను. నీకు చెండడమే నా పరమావధి అవునో కాదో నీకే తెలుస్తుంది, చూద్దుగాని!

స—అయితే, సరేనండి (అని మెత్తగా నవ్వుతుంది) మరి బతిగానన్న మాటే!

శా—ఒరేయి, మనరోగిష్టి పిల్ల కొంచెం ఉత్సాహంలో పడింది రా, రా.

మా—ఎరీ? నే చూస్తానుండండి. అవునండోయి, ఎంత ఆశ్చర్యమండీ? ఎంత కులాసాగా ఉన్నారో ఇప్పుడు!

సు—అయ్యా, వినండి కులాసా ఎందుకు కలిగిందంటే నా విద్యనిబట్టి నేను చిన్న మందొకటి వాడి చూశాను. శరీరంమీద అధికారి, మనస్సు! శరీర వ్యాధులకి మూలం, మనస్సే. అందుకని నేను ముందు మనస్సు కుదురుస్తూంటాను. మొదట ఈమె చూపులూ, ముఖవైఖరీ చూశాను. క్రమంగా చేతుల్లో రేఖలు చూశాను. కొంచెం దైవజ్ఞుణ్ణి కాబట్టి ఇక్కడ జబ్బు మనస్సు జబ్బే. అని పోల్చుగున్నాను. లేని పోని ఊహావిహారమూ పెళ్ళాడాలని బలీయమైన కోరికా— ఈ రెండింటివల్లనే ఆ మనస్సు జబ్బు అందులోనూ, జనానికి పెళ్ళిమీద ఉండేమక్కువచూస్తే నాకు కొంచెం అతిగా ఉన్నట్టున్నా, ఈ రోజుల్లో హెచ్చుతగ్గుగా ఉన్నట్టున్నా కనిపిస్తుందండీ!

శా—(మాలోకాన్ని మెచ్చి) మాలోకం! ఓరి, నీ తెలివి బంగారంగానూ, ఎంత తెలివిగలవాణ్ణి తీసుగొచ్చావురా!

మా—(నవ్వుతూ) ఏమిటనుకున్నారు, మరీ!

సు—కాని, వివాహం అనే విషయానికి నేను పెద్ద ముఖం పెడతాను.

శా—ఔర! ఏమి ప్రజ్ఞండీ! మాలోకం! నా మనస్సులో ఉన్నవన్నీ ఈయన వరసాగ్గా చెప్పేస్తున్నారురా!

మా—లేనివి కూడా చెబుతూంటాడు, జాగర్తగా వినండి.

సు—రోగులు ఏమంటే మనమూ అదే అనాలి. ఈవిడలో లోపం ఒకటి కనిపించిది. ఆలోపం గురించిన జాగ్రత్త పడకపోతే ప్రమాదించేలా కనిపించింది. ఆలోపం గురించిన జాగ్రత్తపడకపోతే ప్రమాదించేలా కనిపించింది. ఆ లోపాన్ని ఆధారం చేసుగునే నేను ఆవిడతో మాట్లాడాను "ప్రస్తుతం నేను రావడం తనని నాకిచ్చి పెళ్ళి చెయ్యమని మిమ్మల్ని, అడగడానికే!" అని తన్నా వేసి చూశాను. ఆ తన్నాతో మబ్బు విడ్డట్టు, మెరుపు మెరిసినట్టు, ఆవిడ వైఖరి మారింది, ముఖానిక్ కలకలవచ్చింది, నేత్రాలకి జీవం చేరుకుంది. ఈవిశ్వాసంలో ఈవిణ్ణి కొంతకాలం ఉంచి ఊరుకుంటే, ఈవిడ వ్యాధి పూర్తిగా మళ్ళుతుంది.

శా—ఆహాహా! డాక్టరుగారూ! చాలాబాగుంది. ఈ చర్య యావత్తూ నాకు సమ్మతమే.

సు—తరవాత, సంపూర్ణారోగ్యం కలగడానికి ఇతర ఔషధాలు వాడవచ్చును.

శా—(కొంచెం నవ్వి) ఔనౌను. అదే ఉత్తమ మార్గం.

సు—మీరుకూడా అల్లా చెప్పిచూడండి. సుస్తీ అసలు తగ్గిపోతుంది.

శా—అచ్చోయి, సరళా! ఈయన నిన్న పెళ్లాడడానికే వచ్చారమ్మా! నిజమేనమ్మా! నేను ఇందుకు సంతోషంతో ఒప్పుగుంటున్నానని ఈయనతో చెప్పాను. నీతో కూడా చెబుతున్నాను. సుస్తీ తగ్గించుకో అమ్మా! అసలు నీకు సుస్తీ ఉండదమ్మా!

స—అయ్యో! బుద్ధిపూర్వకంగా నువ్వెక్కడ ఒప్పుగుంటావ్, నాన్నా!

సు—(రహస్యంగా శాస్త్య్రతో) ఒప్పుగుంటానసండి, ఊరికే.

శా—ఆఁ నేను మహారాజులాగ ఒప్పుగుంటానమ్మా!

స—మీరు చెప్పేది మనఃపూర్వకమేనా?

శా—మనః పూర్వకమూ హృదయపూర్వకమూ కూడానమ్మా, వెర్రితల్లీ!

స—ఏమండీ, డాక్టరుగారూ! మీరు నాభర్త కాగోరుతున్నారా!

సు—అవును.

స—అందుకు మానాన్న అంగీకరిస్తున్నాడా!

శా—అంగీకరిస్తున్నాడే, చిట్టి తల్లీ! అంగీకరిస్తున్నాడూ!

స—ఇదంతా నిజమే అయితే, నా సంతోషం అడిగారూ!

సు—సందేహించకు, సరళా! నీమీదనాప్రేమా, నీభర్తను కౌగలిగితే చాలనేటటువంటివాంఛా, నేటివికావు. ఇక్కడికి నేవచ్చింది అందుకే!

(రహస్యంగా శౌనయ్య చెవులో) ఊరికే అంటున్నానండి, శౌనయ్యగారు!

శౌ—అవునవును. నాకు తెలుసు. బాగుంది. అల్లానేఅనండి.

సు—అసలు పరమయధార్థం చెప్పెయ్యాలంటే, సరళా, నా ప్రస్తుతస్థితిగాని, వేషంగాని, నిజంకావు. మీనాన్నగారిఎట్టఎదటే నిన్నుకలుసుగుని, నాకోరిక ప్రకటించడానికి వీలుండే నిమిత్తమే, నేనుఏదో డాక్టర్నంటూ మిష కల్పించుగుని వచ్చాను.

స—మీారు నా మీాద అతి గంభీరమైన ప్రేమ ప్రకటిస్తున్నారు. అది నాకు ఎంత బోధపడాలో అంతా బోధపడింది.

శౌ—ఆఁ ఆఁ ఆఁ, ఆసి యింద్రజాలీ! చిత్రమవుతుంది. ఎంత బోధపడాలో అంతా బోధపడిందట! నే చెప్పినప్పుడే బోధపడి ఉండకూడదూ, ఈ మూారాముళ్లు లేకుండానూ!

స—నాన్నా! నన్ను ఈయనకివ్వడం, నీకు నిజంగా ఇష్టమేనా, కాదా?

శా—నిజంగా ఇష్టమే నే మహాప్రభో అని ఎన్ని మాట్లు చెప్పిస్తా వేమిటి నాచేతా! పోనీ నువ్వు నమ్మకపోతే, ఏదీ నీచెయ్యి! డాక్టరు బాబూ, నీ చెయ్యి ఇల్లాతే అమ్మా, దీని కింకా నమ్మకం లేదుటా! నీచేతులో ఉంచుతా ను. సరా? ఇప్పుడు నమ్మకం కుదిరిందా అమ్మాయి!

సు—తన నమ్మకానికీ నాకృతజ్ఞతకీ తార్కాణగా ఈ ఉంగరం ఆవిడ వేలుకి ధరించాలి. ఇది మనోవ్యాధుల్నీ భ్రాంతుల్నీ పారదోలే యక్షిణీ ఉంగరం.

స—సరే, అల్లానే ధరిస్తాను. అల్లాయితే పెళ్ళి-ఖరారు వ్రాయండి.

సు—(మెల్లిగా) శానయ్యగారూ! ఈసంగతి వ్రాత మూలం చేస్తేమాత్రం చిక్కేమిటీ!

సు—(మెల్లిగా) చిక్కా! చిక్కు ఎంతమాత్రం ఉండదు. (అని దగ్గి-ప్రకాశంగా) అయితే, డాక్టరుగారూ, చూడండి! అమ్మాయి కోరుతూన్న దల్లా, తమ దయవల్ల, శాస్త్రంత వివాహపు టగ్రిమెంటుకదా! అకాస్తముక్కా మీరు రాసి ఇచ్చెయ్య కూడదూ పోనీనూ!

సు— అందుక భ్యంతర మేమిటండీ! తమ ఆసరా ఉండాలిగానీ!

శా—నేయిక్కడున్నాగా, రాసిస్తురూ!

సు—ఉంటే సరికాదండి, అంగీకారం ఇవ్వాలి.

శా—ఓ దివ్యంగా ఇస్తాను.

సు—అయితే ఇదుగో! (అనిరాయడం అభినయించి) "సరళని వివాహం చేసుగుంటానని ఈ తేదీని నేను బుద్ధి

పూర్వకంగా నాసమ్మతిని మాటయిస్తున్నాను. సరళ ఇష్టమే తన యిష్టమని సరళ తండ్రిగారు అనగా శౌనయ్యగారు తమ అంగీకారం ఇచ్చారు."

శౌ—వొట్టొట్టి అంగీకారమే కాదు. పదివేల రూపాయలు కూడా ఇస్తానని రాయండి.

సు—ఓ రాస్తున్నాను. (అని అభినయించి) "ఈ వివాహానికి ఒకవరతుగా సదరు శౌనయ్యగారు, సరళకి...

శౌ—'సరళకి' కాదు–' దంపతులకి' అని రాయండి.

సు—(రాయడం అభినయించి) రాశానండి. "దంపతులకి పదివేల రూపాయలు ఇవ్వవలెను.–ఇట్లు, సువర్ణం."

స—డాక్టరుగారూ! మీాకు చాలాకృతజ్ఞురాల్ని నాన్నా, ఇకనువ్వు---(అని సందేహిస్తుంది)

సు—దీనిమీాద మీాసంతకం కూడా చేశారంటే ఇప్పటిమాట సరేసరి ఇకముందుకూడా మీా అమ్మాయికి సుస్త్రీలనేది ఉండనే ఉండదండి.

శౌ—చూశావా అమ్మాయి! అగ్రిమెంటు ఎల్లాతయారుచేయించామో చిటికెల మీాదా! ఈకాగితం నీదగ్గర పెట్టుకో! జాగర్తగా పెట్టుకో అమ్మా! తరవాత తరవాత నేనుకూడానూ. దీని మీాదా, నాసంతకం కూడానూ! చేసేస్తానూ! నుబ్బరంగా ఉంటుంది.

స—కాదునాన్నా! నువ్వూ ఇప్పుడే చెయ్యాలి సంతకం! తరవాత ఎందుకూ! నీసంతకం లేకుండా ఆకాగితం నాదగ్గి రెందుకూ! నేనూ నాసుస్త్రీ ఉంటాం, తీరిపోతుంది.

సు—నిజమేనండీ. సుస్తీ తిరగబెట్టచ్చు.

శా—ఇంతేనా మహాద్భాగ్యం! ఎదండీ కాగితం. ఇదుగో (అని రాసి) నా సంతకం, సరా? తృప్తేనా సంతోషమేనా?

స—చాలా సంతోషం నాన్నా! తల్లిదండ్రులఋణం ఏసంతానమైనా తీర్చ గలిగినా, నీఋణంమాత్రం నేనుతీర్చ లేను, నాన్నా

శా—ఋణానికే మమ్మా, తల్లీ! సుస్తీకుదిరింది కదా!

స—ఓ. సుస్తీ కుదరడమే కాదు, జీవితం కుదిరింది.

శా—అమ్మయ్య! అదే నేకోరేది.

సు—మరోపనిచేశానండి నేను ఒక వాద్యమేళం వాళ్ళనికూడా తీసుగొచ్చాను. వాళ్ళవాయింపు సమ్మేళన యొక్క శ్రావ్యతకి మనోవ్యాధులు సర్దుకుంటూంటాయి! వాళ్ళని వాయించ మనవయ్యా! మాలోకం!

మా—వాళ్ళెందుకండీ! నేను ఆమాత్రం మేళం ప్యలేనూ!

సు—ఇక కొంచెం గాలిషికారు చెయ్యడం కర్తవ్యం! ఇంటి చుట్టూ తోటలో తిరిగి రావచ్చును, రా, సరళా! (అని RF కి వెడతారు)

శా—ఓరేయ్! వ్యాధి ఇంత తమాషాగా కుదర్చడం ఎక్కడా చూడలేదు. మనోవైద్యం ఇదే గావును!

(కార్ హారన్ వినపడుతుంది)

అద్దేమిట్రా! వీళ్ళు కారు మీద వెడుతున్నారా ఏమిటి?

[illegible] బహుశ పెళ్ళినమోదు చెయించడానికి అధికారి దగ్గిరకి వెడుతున్నారుగావును.

శా—పెళ్ళినమోదు ఏమిట్రా, నీ మొహం!

మా—నిజమేనండీ, ఆ డాక్టరు మిమ్మల్ని మించాడు.

శా—ఇతడు అమ్మాయిని లోగడే ఎరుగునా?

మా—చదువుకున్నప్పుడే ఎరుగునేమో!

శా—ఇందాకణ్ణించీ జరిగింది వొట్టితమాషాకోస కాదూ!

మా—తమాషాకోసంకాదు, మజాకోసం.

శా—హారి! ఈ వ్యవహారంలో నువ్వూ ఉన్నావా ఏమిటి?

మా—మీరూ ఉన్నారుగా!

శా—అయితే ఇదంతా నాటకమే!

మా—కాదండి, పూర్వరంగం!

సంపూర్ణము.

*